శ్రీ

# ఖోర్ రాస్కెల్స్.

అను,

## పతిసేవ నాటకము.



చింతా సూర్యప్రకాశరావుచే

రచియింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ
కాకినాడముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1936.

 [వెల. రు. 1—0—0

## ఈనాటకమునందు వచ్చుపాత్రములు.

### పురుషులు.

1. మార్తాండమూర్తి—కథానాయకుఁడు.
2. సుగుణశీలుఁడు—మార్తాండమూర్తి తండ్రి.
3. చంద్రమౌళిశాస్త్రి—సుగుణశీలుని స్నేహితుడు.

4. శివరావు
5 శ్యామలరావు
6. భాస్కరరావు
7. దుర్గారావు

} రాస్కేల్సు.

8. నీలకంఠస్వామి—యోగపుంగవుఁడు.
9. రమణయ్యశెట్టి—ధనవంతుఁడు.
10. అప్పలస్వామి—రాస్కేల్సుదగ్గర నౌకరు.
11. నిత్యానందరావు—విటుఁడు.
12. సబిన్స్పెక్టరు—
13. కొందరు పోలీసులు—

### స్త్రీలు.

14. హైమవతి—కథానాయిక, మార్తాండమూర్తిభార్య.
15. సుగుణవతి—మార్తాండమూర్తి తల్లి.
16. నాగరత్నము—విటకత్తె



# పీఠిక.

ఓ విద్యాధికమహాజనులారా !

నాకుఁ జిన్నతనము నుండియు నాటకకళం డగుటచేత విశేషగ్రంథసహవాసము లేకపోయినను నంతగా నరయక యున్నను దానియందుఁగల యభిమా ప్రోత్సాహవశమున నీగ్రంథమును రచించితిని. దీని నన్ను ప్ర నందును పురికొల్పిన శ్రీయుతులగుగంగాపాత్రుని సత్యానంద గారికిని అచ్చొత్తించు విషయమై ధనసహాయమొనర్చిన యుదారస్వ వులు సల్లాది సీతారామస్వామినాయఁడుగారికిని, సుంకర గురయ్యనాయఁడుగారికిని శ్రీదేవాంగకులమాన్యులకును దీనిని విమర్శించి సవరణ గావించిన శ్రీయుత పామర్తి బుచ్చిరాజుగారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇదియే నూతనరచన యగుటచేతను బూర్ణవిద్య కలుగ కుండుటను దీని యందేవేనిలోపము లున్న నెన్నక మన్నించి మంచినే గ్రహించి వా విద్యాపేక్షకులను హెచ్చరింతు రని ప్రార్థింపు చున్నాను.

ఇట్లు, చింతా సూర్యప్రకాశరావు.

---

# గురుస్తుతి.

సీ. ఏకపత్నీవ్రత | మెప్పుడుఁ నిష్ఠతో
నెఱపుచుండినయట్టి | నీతిపరుఁడు
నిజయుగంధరుమాడ్కి | నెగడి భూమికస్వర్గ
కంకణమునుగొన్న | ఘనయశుండు
వారు వీరన కల్ల | వారలఁ గృపతోడ.
సమభావమునఁ జూచు | సజ్జనుండు
రామాయణాదుల | రచియించినట్టి యా
ఘనులను బోలిన | కవివరుండు

తే. గీ. ప్రాసయతిగణంబులయొక్క | పటిమఁ దెల్పి
నీతిరచనయుఁ బ్రేమతో | నేర్పినట్టి
బుధజనస్తోత్ర పామర్తి | బుచ్చిరాజ
గురువరుం గొల్తు సతతంబు | గోర్కె మీఱ.

ఓం.

శ్రీ శారదామూర్తినే నమః.

# నాందిః

శ్రీ మెరయంగ సౌఖ్యములు చెందెడుశూలికి రక్షణార్థమై
తామరసాక్షుఁడున్ విధియుఁ దక్కినవేల్పులుఁ గాలకూటముం
గామన మొప్ప నిచ్చుటనె కాంతను వీడుట హత్య చేతయుం
భామలకై చలించి మతిఁ బాసి కలంచి చరింప గంగనుం
క్షేమము నొంద నొందలచు జెల్వగఁ దాల్చి, హరింపఁ జేయు నా
బాము విసంబు, నజ్ఞతను బాపిన శ్రీహరుఁ డిచ్చుఁ గోర్కులన్.

సూత్రధారుఁడు——(ప్రవేశించి) ఓహో హో! నేఁడిసభ కనులపండువు చేయు చున్నది. ఏమి నాభాగ్యము! ఓ సభాసదులారా! పరమేశ్వరాంకితముగనె చింతా సూర్యప్రకాశరావుచే రచింపఁబడిన, ఫోర్ రాస్కెల్సు (లేక) పతిసేవ యనుదృశ్యప్రబంధ ప్రదర్శనమును వీక్షింపనై మీరెల్లరు దయచేయుటచే నేఁడు మే మెంతయుఁ గృతార్థుల మైతిమి. నాటకప్రారంభమునకై వలయు పాత్రలు సిద్ధముచేయఁ జనియెదను.

(నిష్క్రమించును.)

ఓం.

శ్రీశారదామూర్తినే నమః



# ఘోర్ రాసెటలు

అను,

# పతిసేవ నాటకము.

ప్రథమాంకము—ప్రథమరంగము.

[ప్రదేశము, చావడి; ప్రవేశము, సుగుణశీలుఁడు, సుగుణవతి].

సుగుణశీలుఁడు—ప్రస్తుత స్థితిగతులనుబట్టి చూడ మనకుటుంబమున,

చం॥ తనయుఁడు మంచివాఁడిపుడు ♦ ధాటిగ హెచ్చుగ వెచ్చపెట్టినన్
ధనమునఁ బోదు నడ్డియును ♦ తక్కువమె యోయబలా! యెటుంగ బ్రా
హ్మణులము రాతపోశమరి ♦ యాదలఖాం గడునన్కిపట్టు కా
వునఁ గనఁగోఁ గుటుంబ మిఁకఁ ♦ బొల్చు మ తామరతంపరన్ బలెన్॥

సుగుణవతి—నాథా! అప్పుడే యేమాతొందర? ఆవగింజలో నరవీసమైనఁ గాలేదే! మనకుటుంబవిషయమున గూర్చి మీరంతగా గర్వపడుట నాకిష్టము లేదు. ఏమందురా! మనకన్న శ్రీమంతులును, నా [redacted]షులను సత్పుత్రులను గవినకుటింబిను లనేకు లు[redacted] అదియును గాక యెప్పటి కేది సంభవము కాఁగలదో [redacted] కెఱుక.

సుగుణశీలుఁడు—బేలా! యిది గర్వము కాదు. లేరనియా, నేఁ జెప్పి నది! లేకేమి? సమస్తైశ్వర్యములతోఁ దులతూఁగుచు బహుధర్మా ధర్మవివక్షతతో దానశీలములతో జీవయాత్రఁ గడపుపుణ్యాత్ము లెందఱో యున్నారు. అట్టివారు డంబముగాఁ గనుపించక మనవల నేదో సంసారపక్షమునఁ గాలముఁ గడుపుదురు.

సుగుణవతి—మాణిక్యమును మసిపాతతోఁ గట్టిన దానియొక్క కాంతి మాయునా?

తే॥గీ॥ సకల సంపదలందుండు ♦ సజ్జనుండు
సుగుణమతి యాచు డంబంబుఁ ♦ జూడకుండ
మసలు చుండినమాత్రాన ♦ మాయ బోనె
యతనికీర్తి యమోఘమై ♦ యమరఁ గాదె?

సుగుణశీలుఁడు—ఇటువంటి యుత్తమగుణుండును సమస్తైశ్వర్యములు గలవాఁడును నూటికొక్కఁడైన నుండుట దుర్లభ మని నాయభిప్రాయము. కడమ యాడంబికాగ్రేసరు లెల్లఁ గొంత యాస్తితో నున్నను రాత్రి పగలట్లు మాఱు చుందురు.

సుగుణవతి—వారట్లు మాఱుచుండుటకు హేతువేమై యుండును?

సుగుణశీలుఁడు—కారణమున కే మున్నది. ఏదో కొంతధనమునకు నధిపతి కాఁగానే కన్నులు నెత్తికెక్కును. నెత్తికెక్కుటయే కాక ప్రథమవిషయము రాబడికి మించినవ్యయము, ద్వితీయవిషయము తనకుఁ దగని లేనిపోని దర్జా! తృతీయవిషయము దౌర్భాగ్యమున ధర్మపత్నులు వీడి చవట లయి సానులయిండ్లఁజొచ్చి యటుపైన నిల్లు నొడలు చెడి, మత్తుపదార్థములను జిత్తుగా నలవాటు చేసికొని యున్నపైకమంతయు నిట్టి వృథావ్యయములకిందనే సమర్పించి యున్నవస్త్రములు లేక యల్లాడుట. అట్టివా రనేకు లునారు.

సుగుణవతి—కేవలము వా రజ్ఞాను లనియే నాయభిప్రాయము.

సుగుణశీలుఁడు—వా రజ్ఞానులైన నగుదురు కాని కేవలము స్వాతిశ యులని నే చెప్ప వచ్చును. వీరిసమాచారము నిటులుండును. సవ్యాపసవ్యవిచక్షణాశూన్యులై న్యాయాన్యాయవివక్షతావిహీను లై దురవగాహాపూహాములను బన్నుచుఁ బాపపుణ్యావివక్షత దృష్టిపథమునఁ బడనీయక దుష్టసహవాసదోషాకారమున దుర్బుద్ధులై హీనవాక్కార్యులై స్వలాభమే శ్రేయోదాయకమని స్వసఖ్యమే స్వర్గసఖ్యమని నిందానియతులై నీతిదూరులై నిష్ఫలజీవులై నిరర్థకులై నిబిడీకృతనీచదోషహాసామ్రాజ్యపట్టాభిషిక్తులై తల్లి యనక చెల్లె లనక యప్ప యనక యన్న యనక కన్నపుత్త్రులయందుఁ గూడఁ గాఠిన్యము వహించి కడకు సర్వప్రాణులయందును హింసారూపకులై ముష్కరమున ముందున్న దండధరప్రచండదోర్దండ దండనలను దలంపక సంచరించునధమాధమమానవు లనేకులు లెక్కకు మిక్కుమిగిలి యున్నారు

సుగుణవతి—ఇట్టి యన్యాయప్రవర్తనకు దిగినవారికి నిహపరము లుండునా ?

సుగుణశీలుఁడు—చూచుచుండఁగనే కన్నులలో దుమ్ముకొట్టనెంచు వీరా యిహపరముల నాలోచించువారు ఛీ! ఛీ! యిట్టి యపాత్రపుగొడవ మననోట నుచ్చరించినఁ బాపము సంభవించును !

సుగుణవతి—పోనీ డాగొడవ మన కెందుకు! ఈపూఁట జంద్రమౌళిశాస్త్రిగా రింకను రాకుండుటకుఁ గతమేమి? ఆయన వచ్చినచో నేవురాణమో చెప్పుచుండును కదా !

సుగుణశీలుఁడు—పాప మాయన కీమధ్య మతి స్థిమితముగా లేదు. ఉన్నగృహము తణఖాపెట్టి తనపుత్త్రుని బి. యే. వఱకుఁ జదివించినాఁడు. అతఁడు బి యే. పేసయి రెండు సంవత్సరములైనవి.

ఎంతకష్టపడి తిరిగినను నిప్పటి కింకను నేయుద్యోగమును గుదిరినది కాదు. అప్పు కొంపను మ్రింగఁ దలంచుకొని యున్నది. మొన్న నే యొక్కఁడనో పుల్లలయ్యశెట్టిదగ్గఱఁ బదిరూపాయలకు గుమాస్తా పని ఖాళీవచ్చిన దని తెలిసి తండ్రి వెళ్ళి వారితో మాట్లాడి వచ్చి కుమారుని వెళ్ళుమన, నింతబ్రతుకు బ్రతికి యింటివెలుపలఁ జచ్చినట్లు పుల్లలయ్యశెట్టిదగ్గఱఁ బదిరూపాయలకుఁ జీట్లు వ్రాయుమ చెదవా యని తండ్రితో దెబ్బలాడినాఁడఁట.

సుగుణవతి—పాపము ప్రపంచమునఁ బనిపాటు లెంతకఱవయ్యెను.

[చంద్రమౌళిశాస్త్రి యొకవైపునుండి క్రిందిపద్యముఁ జదువుచుఁ బ్రవేశించును]

శా॥ రారా! ప్రోవఁగ జాలమేలర యుమా ♦ రామామణీనాయకా!
నారీపూరుషవర్గమెల్ల దిగి యు ♦ న్యాయంబునన్ మున్గెన
య్యో! రా! దుర్వ్యసనాబ్ధినుండి దరి ♦ నెట్లో చేర్చి నీయుదరెన్
గౌరీసత్పతి! పాపనాశన! దయన్ ♦ గాపాడరా మర్త్యులన్॥

శ్రీమంతులను చింకిరిపాతలను గట్టించు నీపాడునిషావస్తువుల కెన్నటికేని యంత మున్నదా! లేదు బాబు లేదు మనవస్తువాహనములను నిండ్లవాకిండ్లను భూములఁ [illegible]ట్రను నమ్మించుటే కాక తమ్ము సేవించువారిగుండెలను జీల్చి బ్రతికి యుండఁగనే శవాకారులఁ జేసి యర్ధాయువుననే కాటిఁ గంపును. అంతట నీనిషాలు మన వారిని విడిచిపెట్టును గాని యీవిధవలుమాత్రము చచ్చినను సాధించవలెనన్నట్టుగాఁ గాష్ఠముమీఁదఁ బెట్టి నిప్పంటించినను గాలుదురా? వట్టిది వట్టిది నేను నమ్మను. ఏమనుజున కేయలవాటు కలదో యారకము సరకు కాష్ఠముమీఁదఁబడినఁగాని యంత్యప్రాణము విడిచిపెట్టదు. అకటకటా! లోక మెట్టిస్థితిలోనకు మాఱిపోయినది! ఓ కైలాసవాసా! నీ విటు కొంతకాల ముపేక్షించిన దేశ మేమైపోవునో

తెలిసికొనుట యసాధ్యముకదా !

సుగుణశీలుఁడు—వారుగో ! చంద్రమౌళిశాస్త్రిగారు ! నోట నేమో గొణుగుకొనుచు వచ్చుచున్నారు.

సుగుణవతి—నాన్నగారూ! నేఁడింతయాయాసముగా నున్నా రేమి ? కూర్చుండుఁడు.

చంద్రమౌళి—(కూర్చుండును)

సుగుణశీలుఁడు—శాస్త్రిగారూ! మీమోము నేఁ డింత విన్నఁదనముగా నున్న దేమి ?

చంద్రమౌళి—నాగొడవ యేమంతని చెప్పుదును బాబూ ! నాసంసారపుగొడవ జరిగినదంతయుఁ జెప్పిన నన్నిచటకుఁ జేర నివ్వ రని భయము.

సుగుణవతి—ఆహా ! నాన్నగా రెంతమూ టాడినారు !

సుగుణశీలుఁడు—మీ రెప్పుడు నింతకఠినముగ మాట్లాడియుండ లేదు. ఈ వేళ నింతకష్టముగాఁ బల్కుట కేదో తగినంతకారణ ముండ వచ్చును !

చంద్రమౌ—కారణమున కేమున్నది ? నాకుమారుఁ డిప్పుడీయూరిలో నున్నరౌడీలకన్న మిన్నయై తల్లితండ్రు లనిన నావంతయు భయము లేక తనవీరత్వ మధర్మముగా నందఱిపైనఁ జూపించిన నన్యులా యూఱ కుందువారు ?

సుగుణవతి—ఇప్పు డేమి వచ్చినది ?

చంద్రమౌళి—చెప్పుట కేమున్నది? తల్లీ! మావాఁ డొకసిగరెట్లు దుకాణముదగ్గఱ బకుస్సై పురూపాయలకు సిగరెట్లు కిల్లీలు సోడాలు మొదలైనవి వాడినాఁడఁట! మరి వారి కేమి జ్ఞానము లేదో వీని కింతవఱకు నరువు పెట్టుటకు? వాని ననవలసినపని యేమున్నది. ఈరోజులలోఁ గానికి గతిలేనివాఁడుఁ గూడఁ గాసులదొరవలెఁ గాన్పించును.

వానియొక్క వాగ్ధోరణి వేషభాషలఁ జూచి గొప్ప తెలివితేటలు కలవారె తెయితెక్కలాడెదరు. అది యటుంచుఁడు మావాఁడీదినమునఁ గొందఱురౌడీవిధవలతోఁ గలిసి యిదివఱకుఁ దాను బాకీయున్న దుకాణపువీథిని బోవుచుండ నాసిగరెట్లదుకాణమువాని ప్రాణము విసిగి మావానిచేయి పట్టుకొని నాబాకీ యిచ్చి కదులుము లేదా నీయొంటి నున్నవస్త్రములన్నియు నొలిచి యిక్కడఁ బెట్టుదనని యదలింప, నలుగురిలోన నాభాసయ్యెనని దగ్గఱ నున్నవిధవలు పురికొల్ప, వానితోఁ గలియఁబడి పోట్లాడ నారంభించెనఁట ! వారియొక్క పరివారము బొమ్మజెముడుడొంకవలెఁ బెరిగెనఁట! అంత నీకఁ దడసిన మడియు వలసివచ్చునని యుద్రేకము పుట్టి వారివందఱను దప్పించుకొని పాపము వానిదుకాణముపైఁ బెట్టి యుంచిన సోడాబుడ్లను బైకెత్తి వారిపై విసర నారంభించెనఁట. సుమారొక పదియునయిదుగురకు గాయములు తగిలినపిమ్మట మావానిపైపున నున్న పెద్దపెద్ద రౌడీలందఱు నొకరోడ్డే పట్టిన నేమి పుట్టి మునుఁగునో యని మావాని నచ్చట విడిచియే వారు సందులో నుండి చల్లఁగ జారిపోయినారఁట.

సుగుణవతి—ఆహా ! వారెంత మిత్రద్రోహులు!

చంద్రమౌళి—రౌడీలన నేమనుకొంటిరి ? ఎక్కడనైన నాయుట్టి వెఱ్ఱిబాగులవానిఁ బిరికిపందను బెదిరించి డబ్బులాగి యెత్తినగ్లాసు దింపకుండఁ ద్రాగి సొమ్ములు విడుచుకొని ప్రగల్భములు చెప్పుచు నిట్టి దెబ్బలాటలు తెచ్చుటయే కాని తగినసమయములయందు మాత్రము పనికిరారు తరువాత నే నాపోట్లాటవేళకు దైవవశమున నచ్చటఁ దారసిల్లి చూచుసరికి మావాఁడక్కడ యుద్ధవీరునివలె నైదాఱుదెబ్బలొడలి నుండ నాకన్నులఁ బడినాఁడు; ఇఁక నొక క్షణము కడచినచో నాపుత్రుఁ డేమౌనో? అంత నాకు నొడలంత

యుఁ జెప్పుటలు గ్రిమ్మి కొల్ల నగరు జనించి తూట రాక యట నున్న పెద్దలపాదములు పట్టుకొని కుమారు నక్కడ నుండి తప్పించు సరికి నాపెద్దలు జ్ఞప్తికి వచ్చిరి ఆ క్రూరులవలన దెబ్బలు తినినవా రిక నితరప్రయత్నము లేమియుఁ జేయకుండుటకై నాభార్య మెడలో నున్న కాసుల పేరును రెండువందలరూప్యముల కమ్మి వారి కర్పించి యొకనమస్కారముఁ జేసి వచ్చితిని.

సుగుణశీలుఁడు—అయ్యయ్యో ! మీకుమారుఁ డంతదుండగుం డయెనా ?

చంద్రమౌళి—అది యటుంచుఁడు; వీనిబాగునకై నేను వారికి రూపాయ లిచ్చినసంగతి తెలిసికొని నన్ను తిట్టినతిట్టు లాభగవంతు నకుఁ దెలియును ; తుదకుఁ గొట్టుటకుఁ గూడ సిద్ధపడెను.

సుగుణవతి—అన్నన్నా ! ఇదివఱ కెంతోయుత్తముఁ డని తలంచు చుంటిమి.

సుగుణశీలుఁడు—(తనలో) ఆహా ! విధినిర్ణయ మెంతవిచిత్ర మైనది !

సీ॥ రంభాసమానయౌ ♦ రామకు నొనఁ గూడు
వికృతమూర్తి నె యున్న ♦ విభుఁ డొకండు
సత్యధర్మసునిష్ఠ ♦ సదయాత్ముఁ డగునట్టి
దొడ్డవానికి నౌను ♦ తొత్తొకర్తు
దానకర్ణ సమాన ♦ ధార్మికునకు నిలఁ
బుట్టును లుబ్ధుఁడౌ ♦ పుత్త్రుఁ డొకఁడు
పరలక్ష్మీయ మెకోరు ♦ కరుణామయునియందు
గుత్సితాత్ముల నెల ♦ కొల్వుచుండు
తే॥ గీ॥ నధికబలశాలి యగువాని ♦ కబలసుతుని
సుందరునకుఁ గురూపుఁడౌ ♦ నందను నిఁక
వ్యసనహీనున కధికదు ♦ ర్వ్యసనుఁ గూర్చు
ముందువెనుకలు చూడక ♦ ముసలిబమ్మ॥

చంద్రమౌళి—అమ్మా! సౌకుమారుఁడొక్కఁడు మాత్రమే పాత్రుఁడై యుండిన నా కింతచింత యుండదు కాని మొత్తముమీఁద భగవ న్మాత చేఁతలనే హెచ్చుగాఁ గనుచున్నది.

సుగుణవతి—శివ! శివా!

సుగుణశీలుఁడు—నెట్టిదానా! మొదటనే చెప్పితిని కదా నూటికైన నొకఁడుత్తముఁడు లేఁడని? అందుఁ గొందఱినడవడికలు వేష భాషలు కడువిచిత్రము లైనవి.

చంద్రమౌళి—విను తల్లీ! నే వివరించెదను.

సీ॥ లుంగీ యన భ్రమూరు ♦ లూజు షరాయిని
తొడిగి వీథులనెల్లఁ ♦ దుడుచునొకఁడు
పురుగుకొరికినట్లు ♦ పుంజేఁడు వెండ్రుకల్
మూతిపై నుంచెడు ♦ మూర్ఖుఁడొకఁడు
అందమౌ పరమకాంత ♦ యెందేనిఁ గన్పడఁ
గానికూఁతలఁ గూయు ♦ ఖలుఁడొకండు
మొనగాఁడ నంచును ♦ మోమును నిగిడించి
సంసారిపై సైగ ♦ సలుపు నొకఁడు

తేగీ॥ అట్టిదుష్టులే కాని యీ ♦ యుషనియందు॥
నయము భయమును గల్గియ♦ నవరతమును
సంచరించెడిసద్గుణ ♦ శాలి యొక్కఁ
డేని కోటికి నండునా ♦ యెంచి చూడ

సుగుణశీలుఁడు—అయ్యా! తమ కిప్పు డున్నయుద్రేకమును బట్టి యిట్లను చుంటిరి కాని

సీ॥ సతతధర్మక్రియా ♦ వితతి విస్ఫూర్తితో
ప్రాజ్ఞయశస్కులు ♦ పరలు చుండి

దేశోద్ధరణవృత్తి ♦ దివ్యప్రభావులౌ
నవతారపురుషులే ♦ యలరుచుండి
పలికినవాక్యము ♦ బ్రహ్మశాసన మట్లు
చేయింపఁ గలముని ♦ శ్రేష్ఠు లుండి
కాలిక్రిందను జీమ ♦ కడతేర విలపించు
భూతదయాపరుల్ ♦ పొడము చుండి
ఆ॥వె॥ యాఁపు చుండి రెంతొ ♦ యాదరం బేపారఁ
బృథ్వి భారమెల్లఁ ♦ బూజ్యు లగుచు
క్షితిని నంద అెట్టి ♦ చెనఁటులే చేరినఁ
గాల కున్న భూమి ♦ గడియలోన

సుగుణవతి—పెద్దలభయము లేక చేయువెట్టిచేష్ట లివి

చంద్రమౌళి—ఓవెఱ్ఱితల్లీ! పెద్దలు, పూజ్యులు, ఆర్యులు, భక్తి ధర్మము, సత్యము, ఇవన్నియుఁ బూర్వపుమాటలు. ఇప్పుడు పెద్దలే ముందు గడ్డిఁ గఱచు చుండిరి. నే వినిపించినవే కాక యింకను లక్షలు కల వాబాపతుచేష్టలు

సీ॥ సీమకుక్కను బోలఁ ♦ జీకా కయిన లేక
విరలు క్రాపును బెంచు ♦ వెఱ్ఱి యొకఁడు
మూరెఁడంగీకి ♦ బారెఁడుకాలరు
నీటుగాఁ బెట్టించ ♦ నేర్చునొకఁడు
కోటు ముడ్డిపయికిఁ ♦ గుట్టించుకొని యొక్క
పార్శ్వమే తోడిగెడు ♦ వాఁడొకండు
చెమట లూడ్చెడునట్టి ♦ జేబురుమాలతో
గాయమా యనఁ దలఁ ♦ గట్టునొకఁడు
తే॥గీ॥ విట్టివేసంబులను వేసి ♦ యేపు మీఱఁ
గొంపలను వీడి వీథులఁ ♦ గోఁతులట్లు

తిరిగి యెట్లైన సుకృతుల ♦ తీరుఁ గాంచి
కెవ్వ మని గోల నిడుదురు ♦ క్రొవ్వు మీఱ

సుగుణవతి—ఇట్టిచిత్రకృత్యము లొక్కపురుషులయందే కాని స్త్రీల యందేమియు లేవన్నమాట

చంద్రమౌళి—తల్లీ! స్త్రీకృత్యములఁ జెప్ప నాతరమా? ఐనను వ్యభిచారిణులసంగతులు మన కెత్తనవసరములు లేవు. ఇంక సంసారవనిత లన్ననో

సీ॥ ఓరచూపులతోను ♦ చీర సర్దుటలోను
పరజలబుద్ధుల మాఱ్చు ♦ భామ యొకతె
తలుపు నోరఁగఁ దీసి ♦ తలను బైటకుఁ బెట్టి
జనుల నివ్వెరపఱ్చు ♦ జాణ యొకతె
హరికథల్ నాటకా ♦ లనినఁ జెల్వునఁ జని
పరపురుషావళి ♦ నరయు నొకతె
భర్తవాక్య మనిన ♦ భగ్గుమంచును లేచి
తినయిచ్చ కలయుట్లె ♦ తనరు నొకతె

తే॥ గీ॥ ఇట్టితొయ్యలు లుండిరి ♦ యింతె కాక
బంధువుల నెల్లరను గోసి ♦ పాపవిధిని
మెండుగ ధనమ్ము చేపట్టి ♦ మిండగాండ్ర
వెంటఁ జనునాతు లున్నారు ♦ వేనవేలు

సుగుణవతి—పో నిందు వారిగొడవ మనకెందులకు? కాని (భర్తతో) ఆర్యా! మనతనయునిస్థితి యెట్లున్నదో?

సుగుణశీలుఁడు:— వెఱ్ఱిదానా! దైవవిలాస మెట్లున్న నట్లు కాక మానునా?

చంద్రమౌళి—సుగుణశీలుఁడుగారూ! ఇప్పటికి మూఁడుతరముల నుండి మీసంసారము వ్రేలు పెట్టి చూపింపుట కవకాశము లే

కుండ నేటివఱకు నేమర్గుణము లేక యే ధనకనకవస్తువాహనము లతోఁ దులదూఁగుచునే యున్నది. మీకుమారునిఁ గూడ మీయంతవానిఁ జేసిన మీజన్మము చరితార్థమైన దన్నమాటయే. ఊరకే-చదివించినంత నే యేమిలాభము ! వయసున నున్నకుఱ్ఱ వాఁడు. నామాట విని పుట్టినింట నుండి కోడలిని, కలకత్తా నుండి కుమారుని, రప్పించి కొడుకును గోడలను నెదుటఁ బెట్టుకొని సంతో షముగాఁ గాలముఁ గడుపుఁడు. ఈమధ్య హరనాథరావుగారి యమ్మాయి యేమి చేసినదో విన్నారా! తెగఁజదివి తనసహాధ్యా యుం డైనతెలుకులరామస్వామికుమారుని మొన్న సప్తమీ సోమ వారమునాఁడు గాంధర్వవివాహము చేసికొనిన దఁట ! మరల నీనాఁడు బ్రహ్మసమాజమందిరములోఁ బెద్దలసమక్షమున శాస్త్రో క్తముగాఁ బెండ్లిఁ జరుపుదు రఁట

సుగుణశీలుఁడు—జాతిమతభేదము లుండఁ గూడ దని యుపన్యాసము లిచ్చుచు నూఁగూర సంచారము చేయుచున్న హరనాథరావుగారు దీని కేమను చున్నారు ?

చంద్రమౌళి—ఏమనియెదరు ? వితంతువివాహములు ముఖ్యముగాఁ జేసి తీర వలయు నని ఘోషింపు చున్నగోపాలరావుగారి యేబది యేండ్లు గలవిధవసోదరి నాకు వరుం డు కావలయు నని యాంధ్ర పత్రికలోఁ బ్రచురింపఁ గానే యాయన యాయుద్యమ మెట్లు విడిచెనో యట్లే యీయనకూడ నీయుద్యమము నుండి విరమించు నేమో యని యంద అన్నివిధములుగా ననుకొను చున్నారు. మొత్త మమీఁద హరనాథరావుగారుమాత్రము ప్రజలమోములు చూడ లేక యిల్లు విడిచి యీవలకు వచ్చుటయే మానుకొని యున్నారు

సుగుణశీలుఁడు—ఔను ! పాపము పెద్దకుటుంబము కలవారు

సుగుణవతి—నోరు నొప్పి పట్టులాగున నుపన్యాసము లిచ్చుటయే

కాక తనజీవితమంతయు దానికిక్రిందనే ధారపోసెద నని యాయన యాచింత నేల పడ వలయును?

సేవకుఁడు—(ప్రవేశించి) అయ్యగారూ! కలకత్తా నుండి యబ్బాయి గారిదగ్గఱనుండి జాబు వచ్చినది (ఇచ్చును)

సుగుణశీలుఁడు—శాస్త్రిగారూ! చదివి వినిపింపుఁడు.

చంద్రమౌళి—(ఉత్తరము విప్పి చదువును)

కలకత్తా

మహారాజరాజమాన్యరాజపూజితదిగంతయశోవిశాలదేవ సమానులైనతండ్రిగారికి మీకుమారుఁడు మార్తాండమూర్తి యనేక కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచు వ్రాయువిన్నపము లేవి యన నేను కలకత్తాపట్టణమున సుస్నేహితబృందముతో క్షేమము గానే యున్నాను. పరీక్షలు పూర్తి యైనవి. నాకుఁ దప్పక జయమె లభించు నని తోఁచుచున్నది. ఈవిషయము నాయమ్మగారితోఁ జెప్ప వలెను. ఆమెకు ననేకవందనములు. నే నీనెల యెనిమిదవ తేదీని సాయంకాలము మెయిలులో మనయూరు చేరు చున్నాను; కావున రైలుస్టేషనుకు మనకారుఁ బంపించఁ గోరు చున్నాను చిత్తగించ వలెను

మార్తాండమూర్తివ్రాలు

సుగుణవతి—ఎనిమిదవ తేదీ యీదినమే? మెయిలు సాయంకాలము ఏడున్నరగంటలకుఁ గాఁబోలును వచ్చును

సుగుణశీలుఁడు—అట్లయిన శాస్త్రిగారూ! మీ రిప్పటి కింటి కేఁగి సాయంకాలము పెందలకడనె దయచేయుఁడు. రైలుస్టేషనుకుఁ బోయి యబ్బాయిని తోడ్కొని వత్తము

చంద్రమౌళి—మంచిది. అమ్మా! వెళ్ళి వచ్చెదను (చనుచుండును)

సుగుణవతి—చిత్తము; మనముఁ గూడ భోజనములకుఁ బోవుదము లెండు. (ఇద్దరు నిష్క్రమింతురు)

[తెర పడును]



# ఫోర్ రౌసెలు

అను,

## పతి సేవ నాటకము.

### ప్రథమాంకము—ద్వితీయరంగము.

[ప్రదేశము. చావడిలో, దుర్గారావు, భాస్కరరావు, శ్యామలరావు, డ్రాయరుచుట్టుఁ గూర్చుండి పేకయాట నాడు చుందురు.]

దుర్గా—మిష్టర్, భాస్కరరావు ఈపూఁట నాదృష్టి యీయాట మీఁదనే లేదోయి

భాస్క—నా బ్రెయిన్ కూడ నీవేళ సరిగా వర్కుచేయుట లే దేమి కారణముననో ?

శ్యామ—కారణ మేమున్నది ? వన్ బాటిల్ విస్కీ యున్నచో నీచీట్ల పేక నిట్లే చిదానందముగ టేబుల్ మీఁద డ్యాన్సు చేయింపవచ్చును.

దుర్గా—యాస్స ఆల్ రైట్

భాస్క—వాటీస్ దీటైం శ్యామలరావు ?

శ్యామ—ఎబౌట్ నైన్ షర్టీ.

దుర్గా—అబ్బా! శిశిరా వింకను నింట నేమి చేయుచున్నాఁడో కదా! ఒకగంటలోనే వచ్చెద ననిచెప్పి వెళ్లినాఁడు

భాస్క—మాట లెన్నియైనఁ జెప్పవచ్చును గాని క్రియలు జరుగుట కష్టము. వెళ్లినాఁడు కదా! ఆలస్యమో గీలస్యమో యేదోవిధముసఁ బని సాధించుకొని వచ్చినచో వండన్ గా నుండును.

దుర్గా—వాఁడు వచ్చుసరికి మన మొక్కొక్క పెగ్గయినఁ దగిలించిన బాగుండును.

శ్యామ—నిన్న రాత్రి విస్కీబాపతు శేష మేమైన నున్న దేమో?

భాస్క—ఔనురా! (బిగ్గరగా) అరే! అప్పలస్వామి! అప్పలస్వామి!

అప్ప—(లోపల నుండియే) వచ్చేసినాను, బాబు! వచ్చె. (ప్రవేశించును)

భాస్క—లోన నేమి చేయు చున్నావురా.

అప్ప—(తనలో) ఆఁ మిగిలిందికూంతా మింగుతుండాను (ప్రకాశముగా) నానేటి సేత్తుండాను. బాబు! అంత అరిజంటుగా పిలిసినా రేమి?

శ్యామ—రాత్రిబాపతు శేష మేమైన నున్న దేమో యని.

అప్ప—ఇయ్యప్పల్ ఘాంగోఁ డంత యెట్టిబాగుల్లోఁ డనుకుంతున్నారు? మనదగ్గిర సేసాలు గీసాలు లేవన్నాసంగతి యీళ్ళ కింకా యెరికి నేదు కాఁవోసుం (ప్రకాశముగా) బాబయ్యాగోరు! యెప్పుడు నాసెవ్వుల్లోకి రానిమా టొచ్చినాదే ఇయ్యాల తమనోటిలోనుండి

దుర్గా—ఏమిటీ?

అప్ప—యేంటంటిబాబూ! మనోరు కోరికి నిన్న మిగిలిపోయినపాసి సరుకు ఒకబరందన్నమా టేటి డబ్బుతోటిసుద్దా నిన్నున్నవొత్తు వీపూఁట కరుసుపెట్టటం యిట్టమే నేదు కందా! యీబాబయ్యా గోరు యింత తేలిగ్గా తయ్యారుపడినా రని నాకు సిగ్గేత్తుండాదండి

శ్యామ—ఓరిఫూల్ ! నిన్న విప్పినవిస్కీబాటిల్ ఈవేళ తాగుట
యేం దేమితప్పరా ?

అప్ప—తప్పనోళ్లెడోయ్ బాబయ్యా ! మనకలవాటు లేనిపని సెయ్య
మంతారా అంతున్నా ? మరటయితే నే నేంటిసేసీది ?

శ్యామ—ఏమిచేస్తావు ? గ్లాసులోఁ బోసి చేతి కందిచ్చిన హుషా
రుగా నుండును.

అప్ప—నాసత్తెప్పెవానకంగా మనయింటిలో వక్కసుక్కయినా
నేందే. నిన్న సందకా డోట్టుకొచ్చినపెద్దసీసా అంతా ఆసందట్లోనే
తాగేశాం. యిం కేఁబోట్టుకొత్తాను? నిన్నరేయి ఆయ మ్మోరద
తుంటే మీారంతా యీారామైనకాలఁ బడి ఆడడం నేను గాజుగలాసులు
నిండా సరు కేసుకుని తూల్తా రాటం నన్ను శివరావుగోరు ఎగర
తన్నటం ఓరిబాబో యిలాగ సేసిసేసి వల్లు తెలియకుంటా యెవళ్ల
తెన్నాళ్ళంతొంగు ఉన్నాం గందా యేమున్నా మిగిలుంటే పొద్దున్న
దాంతోటె మొగం గడిగుందును గదూ బాబయ్యాగోర్లు

శ్యామ—ఓరి నీసొద కాల ? టీ యైన నున్నదా ?

అప్ప—(తనలో) ఇదొకపెద్దమోర్మాయి పెరపంచికా న్నట్టుకుని పీక్కు
తింతుంది. కూకుంటె టీ లెగిత్తే టీ మాటాడితే టీ పాటపాడితే టీ
పని మొదలెడితే టీ రామ ! రామ ! పయిత్తించి పసరు పెరిఁగించు
ఆబుందనీ ల్లోకగంట నేకపోతే వుండనేరుగందా (ప్రకాశముగా)
టీ యెట్టుకొచ్చేదా బాబు ?

భాస్క—ఇఁకను దెచ్చెద ననుటయే ?

అప్ప—కాగుతుండాది బాబు ! (నిష్క్రమించును).

శ్యామ—ఇంతటివారము మనము డబ్బునకై విచారించుట చాల
నాశ్చర్యకర మైనవిషయము.

భాస్క—కాల మనుకూలము కానియప్పు డేమి చేయుదుము? సర్వ

విధములఁ బ్రయత్నింపుచుంటిమి కదా!

అప్ప—(టీప్లేట్లను బట్టుకొని పరివేశించి) ఈపూర మారుగురికి డబ్బు కోసమై యిశారం కూడానా? ఓఁడిబుబ్బయినా! మాట్చి వోట్టుకొత్తారు. యిూళ్లోక్కళ్లికరుసుకైతే యింత గోలుండకపోనుగాని ఆడదాయిలుకే యెక్కువగావాలి. యిూళ్లు రెండుబుడ్లొట్టుకునీటప్పుడికి ఆయమ్మప్పుడే ఒక్కటెక్కించుకుంటాది. ఆతరోత పొర్లుతారు దొర్లుతారు (అందఱకన్ని ప్లేట్లు నిచ్చును).

దు, భా, శ్యా,—(రావులు టీ త్రాగుచుందురు).

అప్ప—బాబయ్యగోర్లూ! మొన్నోరో గాని పోరాటు మెట్టుకోని అందులో ఒకెంపోరు మన కోవందరూపాయిలు కరుసు కిచ్చి కోప మున్నోల్లిని తన్నుమంటే తస్సాగోయ్యా! ఆళ్ళనా రైలు రోడ్రుకా డొట్టుకోని రొండు డొడ్డించఁగానే ఆళ్ళు మొర్రో మొర్రో అని మనకి సల్లఁగా యేమాత్రమో చేతులోఁ బెట్టి ముందోళ్ళని మొత్తమంటే అయ్యా యిబ్యా పుచ్చుకోని ఆతనువు మా బాగా తిరిసేనండి. ఈగోజుల్లో పెద్దమనుసులందఱిదేపద్దతి. కోమటులెక్కితే కగ్గులుకింద కొంపలే అమ్మెయ్యా లని ఇయ్యన్నీ వొగ్గేసి మావోళ్ళు కులపెద్దనొకణ్ణి నిలిపేరు. వోడిపెల్లఁ వయినా యింకొకణ్ణి మరిగి ఆఁడితో టుంటే ఆల్లిద్దర్నీ ముందు కులంలో యెలేత్తారు. ఎలెయ్యఁగానే కులపెద్దని మయూ న్నెట్టి కులఁవోళ్ళునలుగురూ చుట్టూ కూకోని ఆపెద్దసే తాతోత్తుకి పాతికో యెబయ్యో తప్పేయించి ఆడబ్బుతోటి రెండుమేఁకపోతులు నాలుగుకడవల కల్లూ కొని ఒకసో టెట్టి పూరీలు సేసి కడుపునిండా మాంసవు పీకదాఁకా కల్లూ పుచ్చుకోని సిఁవాలు తొక్కుతా దాన్ని కులంలో గలిపేత్తారు. కొన్నికులాల్లో తప్పంటే తప్పే ఒప్పంటే ఒప్పే. ఇక తిరుగు నేదు. మాకులాల్లోమాత్రం ఆసిక్కు నేదు. ఎమ్యాలంటే

సేత్తాం తియ్యాలంటే తీత్తాం రాజావాగ. దీనికేం గాని బాబయ్య గోర్లు మొన్నే దోకిటకువల్ల గడించినడబ్బంతా యేమి సేసేరండీ? యింతం తొట్టుకొత్తారు కాని మన కొప్పానుకప్పాడే పరగడుపు.

శ్యామ—అరే డేం బెగ్గర్! ఏమూవాగుదు? షటప్

అప్ప—(భయము నటించుచు) నా నేమి అడరానిమాట లాడినాను నంజికొందుకుని-ఇంక నాను మాటాడితే వొట్టు (నోరుమూసికొనును)

శివరావు—(సంతోషముగాఁ బ్రవేశించి) హల్లో! డియర్ ఫ్రెండ్సు! గుడ్ మార్నింగు

శ్యా, దు, భా,—(రావులుముగ్వురు) గుడ్ మార్నింగు మార్నింగు గుడ్డు

అప్ప—శివరావుబాబయ్యగోరికి దన్నాలు. యెడఁబోయినారు బాబు!

శ్యామ—వెళ్ళినపని యైనదా లేదా?

శివ—కాకున్న ముఖాని కీతే లెక్కడిది?

శ్యామ—ఆల్ రైట్. షేక్ హేండ్ (అట్లు చేయును)

భాస్క—వా లెమాంటు?

శివ—ఇదిగో యింత (జేబులోనివస్తువును బల్లపైఁ బెట్టును.)

ముగ్వురు—థేంక్సూ! థేంక్సూ!

శ్యామ—మిష్టర్ శివరావు! సిడ్డవున్

శివ—కూర్చుండుట కేమి కాని మనవ్యవహార మేమియు బాగుండ లేదోయి!

దుర్గా—ఏవిషయమున?

శివ—మొదటిది యింట నున్న పెద్దల నేడ్పించువిషయమున

భాస్క—నాకుఁ గూడ నది చాల నసంభవమైనపనియే యని తోఁచు చున్నది

శ్యామ—(తనలో) ఈవస్తువుతో వీనినిబుల్లు మాయిండ్లనలె ముంగళ

మైన ట్లున్నది. అటయిన మరల గొంతు తడి చేసుగువఱకు నీయ
చన వీని నిటు లేడిపించుచునే యుండును

శివ—కానిమ్ము దాని కేమి కాని ప్రపంచవర్తనమును బట్టి నా కిపు
డొక లెక్చరు ఇవ్వ వలయు నని కుతూహలము గా నున్నది.
కాఁబట్టి మీరు సావధానముగా విన వలయును

శ్యామ—మీ రింతింతచదువులు చదివినారు కాని మీకు సరియైన
బ్రెయిన్ లేదోయి ! గ్రహచారవశమున మీకు నుద్యోగములు
లేక పోయినవి కాని యవియే యున్నచోఁ బ్రజలపా ట్లేమని చెప్ప
వచ్చును

దుర్గా—మా బ్రెయిన్‌లో నన్న దోష మేమి కని పెట్టితివిరా నీవు ?

శ్యామ—దోషమా యిఁదు వినుఁడు

తే॥ గీ॥ ఆంధ్రు లేకార్యమందైన ♦ నాదిని గణ
పతిని దలఁచియే చేసెడు ♦ భంగి మనముఁ
గూడ మున్ముందుగా బ్రాందిఁ ♦ గ్రోల నిలుప
కెట్టికార్య మైనను జేయ ♦ గట్టి దగునె ?

ముందుగా బ్రాందిబాటిల్సున కార్డరిచ్చి వచ్చినపిమ్మటఁ గొద్ది
కొద్దిగా సేవింపుచు లెక్చర్సు నిచ్చుచున్నచో నెంత గ్రేండుగా
నుండును.

అప్ప—అద్దిగదీ ముంగటమాట చెప్పేసినారు

శ్యా, దు,—హియర్ ! హియర్ ! వెరీగ్రాండుస్పీచ్ !

శివ—అట్లయిన నీవస్తువతనియొద్ద నడ్వాన్సుగా నుంచి మన కేయే
వెరైటీస్ కావలయునో యవన్నియుఁ దీసికొని అప్పలస్వామిచేతి
కిచ్చి నీవు ముందుగా ఒన్ బ్రాందిబాటిలు టూసిజరుసిగరెట్సు
పెట్టెలు సిక్సరూపీస్‌రొక్కము మాత్రము సైకిలుమీఁద వెరీ
అర్జంటుగాఁ దీసికొని రా వలయును

శ్యామ—యెస్ యెస్ రా! రా! అప్పలస్వామి (చనును)

అప్ప—మళ్లీ నాలుగురోజు లోకెలు గెలిగేఁ వన్నమాటే (చనును)

[illegible]—యెరాబ్రిదర్! మనము ధనముకోసమై విచారించుయోగము పోవుమార్గ మేదిరా? (ఆలోచించును)

భాస్క—(కొంతసేపూరకుండి) నాకొకయాలోచన తట్టుచున్నదిరా! యేలక్షాధికారి నైనఁ గ్రమముగ గ్రంధములోనికి దింపిన బాగుండు నని

దుర్గా—ఆల్‌రైట్! కాని యిఁకనొకవిధ మైన బాగుండు నని తోఁచు చున్నది ఏమిటన ట్రెయిన్సులోఁ బెట్టెలను మార్చుడాపెంగుతో వర్కు చేయుట. ఆపని మీకుఁ జేత కానిచో మీరు కొంచెము చేయూతగా నున్నయెడల గంటకుఁ దొంబదితొమ్మిది మార్పఁ గలశక్తి నాయొద్ద నున్నది.

శివ—నాన్‌సెన్సు! ఆపని యిప్పు డంతమోజుగా లేదురా!

భాస్క—పాడినదే పాడరా! పాచిపళ్లదాసరీ యనునట్లు అనేకు లాచ రించు చున్నయాపని మనమా విడిచి న్యూస్కీమ్ ఒకటి ఒరి జనల్‌గా నుపయోగించి, అద్భుతముగా, నెగ్గ వలయును

శ్యామ—(బ్రాందిబుడ్డితోను సిగరెట్లుపెట్టెలతోను సంతోషముగాఁ బ్రవేశించి) ఇదిగో నిప్పు డైతే షంపైర్. యివ్వండి బ్యూటియస్ట్ లెక్చెర్స్! పాట పాడుచు బ్రాంది అందఱకు నిచ్చుచుండును)

అందఱు—(కొంచెము కొంచెము త్రాఁగుచు) హోయి! హోయి! (అనుచు సిగరెట్లు కాల్చుచుందురు)

శివ—(లేచి) ఇదిగో! లోభత్వమును గూర్చి నేను ముందుగా లెక్చె రివ్వఁ దలంచుకొన్నాను.

భాస్క—లోభత్వమునుగూర్చి నీవు లెక్చె రివ్వడానికి ఈబేచ్‌తోఁ జేతకానివాఁ డెవఁడురా?

శివ—షటప్! నాలెక్చెరు ముగించేవఱకు నెవ్వరైన మాఱుపల్కి నచో దెబ్బలు దినఁగలరు జాగ్రత్త; సావధానముగా వినుఁడు... ఆలోచించి చూడ మన దేశమున నన్నిఁటికిని దరిద్రా ఖ్యం దున్నవా రనేకు లున్నారు. అట్లుండుటకు హేతువు సారాబ్రాంది కల్లు నల్లమందు గంజాయి సిగరెట్టు మొదలైనవిలాసవస్తువులే యని బ్రెయిన్ లేనిఛాందసపురకములు నోఖ్యచించుకొని వాగిన మాత్రమున వారిమాటలు వృయ్ కే రేజాట్! మన దేశములో దరిద్ర దేవత డ్యాన్సు చేయుట కొకగొప్పకారణ మున్నది. అదేది యన సమాయకుల నేడిపించియుఁ గృత్రిమముగానో లౌక్యముగానో యతిఘోరముగానో ఒకకాసీ పెట్టుబడి పెట్టి కాసీకి పదికానులు లాభము వచ్చెడియంతర్వ్యాపారములు చేయుచు నింకను దానియం దనేకవన్నాగములు పన్ని కొద్దిరోజులకే మొగిలిపొంక పెరిగినట్లుగా వేలకువేలు సంపాదించువ్యవహారకర్తలనేకు లున్నారు. అట్లు సంపా దించుటయే కాని దానియం దాతనికి నిజమైనయధికారము లేని మాట సత్యమే కాన నాధనము తా ననుభవించుటకు వీ లుండనే యుండదు. ఏదీ! ఇఁక నొకపెగ్గు వేసినఁ గాని స్పీచ్ సరిగా నగుపదు.

శ్యామ—యేస్! యేస్! వన్ పెగ్గేమిటి టూపెగ్సు తగిలించరా (గ్లాసులోఁ బోసి చేతి కంద నిచ్చును)

శివ—(త్రాగి సిగరెట్టు కాల్చుచు) ఊఁదీనికిఁ దార్కాణములు వేఱుగా నేల? చూచితిరా! మావీధికడ నన్నరమణయ్యసాహుకారునకు రమారమి పదిలక్షలరూపాయలయాస్తి యుండు నఁట. మరి వాని కర్మమేమి కాలినదో కాని రోజున కొకగుప్పెఁడుగోధుమలైన సాయంత్రమువఱకు ముద్ద మూతి కూడఁ దినుచునే యుండు నఁట. నా కిప్పటికి సుమారు ట్వెంటీఫైవ్ యియర్సువయ స్సుండును: కాని నేను జన్మ మెత్తినతరువాత వాఁ డొకయతిథికి గుప్పెఁడు మెతు

శ్యామ—నీ వనినట్లెల్ల నొప్పుకొనినచో నీవును నిష్టపడవు. పదిలక్షల రూప్యములయాస్తి యొకని కున్నందున వానివలనఁ బ్రజల కేమ యినఁ దగులాభ మున్నదా! మనదగ్గరా చూచితివా? లక్షలవఱ కెందుకు? పదిరూపాయలు చేత నున్న నూరంతయు నోరెత్తించితి మన్నమాటయే! మనకుఁ జేతఁ గాక లక్ష్మీదేవి యఁట, యూపె మనయింటికి రాదట! రాకేమి? దండము పెట్టుచు వచ్చును. దానికిఁ జేయుసాధనములు చేయవలయును

దుర్గా—దీనిని గూర్చి యింతయాలోచన యెందులకు? ఈలెక్కలెందులకు? ధనము బొంటఁ బోగుచేసినట్లు చేసి దానిని బెట్టెలోఁ బెట్టి పిల్లలను బుట్టించుట తప్ప తానైనఁ దినక యొరులనైన దానియొక్క ఫల మనుభవింపనీయకుండుటయే కాక ప్రపంచములో నుండుధనమంతయుఁ దననెత్తిమీఁదనే పడిన బాగుగా నుండు నని యాలోచించుచు భాగ్రేసరచక్రవర్తులని నేయుపాయము చేతనైన వచించి పైకమార్జింపక మనయట్టివా రూరకున్నచోఁ బాపము కూడా సంభవించును.

భాస్క—పాపము సంభవింపదా! మనదేశము పొత్తుగా బాగుండలేదోయి? చూడుఁడు మనయూరిలోనే ఒకజమీాకి తొంబదితొమ్మిది లక్షరూపాయలయాస్తి యంట ఇంకొకఁడు సాలుకు నిరువదిపే లిన్కంటేక్సు గవర్నమెంటువారికిఁ జెల్లించుచుండెనఁట మరొకఁడు కోటికి కప్పముకట్టుకొని కుర్చుండెనఁట. ఇంకొకఁడు రెండుకోట్లు బేంకిలోఁ బాతిపెట్టినాఁడట. ఈవిధముగా ధనమంతయు నేపాటికమందిదగ్గఱకో చేరుకొని యున్నది. ఇఁకఁ గొద్దియాస్తులవారి లెక్క యెందులకు కాని తక్కినబీదలకందఱకుఁ గూడు లేదుకదా! ఒకరోజు పూర్తిగాఁ గష్టపడినను పాప మొక్కడొక్క మాడుచునే యుండును. ఇఁక వాఁడు ఫేమిలీతో గెటా నొట యెంతకష్టమో యాలోచించుఁడు. ఈపెద్దపెద్దధనికులలో నూటి

కొక్కఁడో యిద్దఱో ప్రజాసౌకర్యము గోరువా రుందురు. కడ మఱికములన్నిటికి వానిదగ్గఱే వానికి సంవత్సరమునకొకకాలు మార్పు చేయు చుందురు. ఆయామాసముల కొకి పాతగుఱ్ఱములను గేన్సిలు చేసి క్రొత్తదానిని రప్పించుచుందురు. సిల్కు సెర్జి సన్ ప్రూఫ్ బ్లేజరు ట్వీడ్స్ మొదలైనసూట్సు తగిలించి కారులెక్కి వీధులన్నియు షైరు చేయుటయే కాని జనుల కేమైన లాభ మున్నదా యేమి? కర్మము చాలక వీ ళ్ళేవేనిప్రజోపకారకార్యములు తల పెట్టిన నవి యెంతయుకాలముగానుండునో చూడుఁడు! మనయూరి లోనే కొంద ఱన్నసత్రములను స్థాపించిరి. అందు శుద్ధముగా బ్రహ్మ ముఖమునుండి బయలుపడినబ్రాహ్మణులే. కాని తక్కిన కుంటి గ్రుడ్డి వార నేకులన్నము లేక యాసత్రపు మెట్లమీఁదఁబడి చచ్చినను సరియే వానికి గుప్పెఁడుమెతుకులైనఁ బెట్ట రదేమిపాపమో!

శ్యామ—ఈసరి కైన మీరిలెక్చెర్సు స్టాపు చేయండిరా! నే గొప్ప స్కీమొకటి యెత్తెఁ దలంచుకొని యున్నాను. మీరుఁ జేత నైన యెడల నప్రిశు కట్టుకొని దిగుఁడు నీయుద్యమమున ప్రాట్నయిట్ కష్టపడినచోఁ బదివేలు సులభముగా సంపాదించుసాధనము చేయుదును

శివ—రైట్ నేనుఁ గూడ నీకు సపోర్టుగా వర్కు చేయుటకు రెడీ

అప్ప—(బుట్ట నెత్తిఁ బెట్టుకొని ప్రవేశించును)

భాస్క—అరే! డ్రెమెట్ ! ఇంత లేటేమిరా ?

దుర్గా—ఏరా...ఫూల్ ! ఖిల్లీలేయిరా !

శివ—ఖిల్లీలు...లేకపోతే సిగరెట్సునవలండిరా! (సిగరెట్లు నవలిమి పారవేయును)

అప్ప—(అట్టె నిల్చి తనలో) అటయితే నానోరేనేటేస్ యింతపాపం జేసుకుంత

శ్యామ—వేసుకోరా ! వెధవా నీవు కూడ ఒకగ్లా సేసుకో ? (అని తానతాగినగ్లాసులోనే బ్రాంది పోసి యిచ్చును)

అప్ప—(పుచ్చుకొని) ఇక్కడింక కులంవూ నేదు గిలంవూ నేదు. కులంవు నేంది బెమ్మసమాజిం. ఆబెమ్మసమాజాన్ని కాదన్నావోడినల్లా ఇయ్యెంగిలిసమాజింలో కలపాలి. ఈగలాసుతోటీ ఈళ్ళునలుగురు అయినారు. ఐదోవోణ్ణి నాను. హ్హు. ఎంగిలేంటి గాడిదిగుడ్డు పెరపంచికువంతా యెంగిలి గాదేంటి ఇది కాకెంగిలి (తాగు చుండును)

శివ—అత్రే! అప్పలస్వామీ! నంజు డేదిరా !

అప్ప—(మాటాడక తాగు చుండును)

శివ—ఏరా! రాస్కెల్ నంజుడు ర్నంజుడు (తన్నును)

అప్ప—(గ్లాసుక్రిందఁ బడి పోవ లోనికి పరుగెత్తి పోవును)

శివ—షంప్పైర్! నాతో కుస్తీ యెవడైనా చాలంజీ.

శ్యామ—హ్హా, హ్హా, హ్హా, హ్హో. కుస్తీ, కుస్తీ, నో, ర్నో

భాస్క—కుస్తీ నో అయితె నాతో పాట పాడండిరా !

దుర్గా—ఎవఁడురా! పాడేవోఁడు. ప్రాడక పోతే కాలికింద బలాదూర్ (కాలు పైకెత్తి తిరుగుచుఁ గ్రింద బడును)

అందఱు—హి హి హి హ్హీ ! (పెద్దపెట్టుగా నవ్వుచు వికటచేష్టలు చేయుచుఁబాట పాడుదురు)

అప్ప—(ప్రవేశించి) ఓరి మియ్యింటికాన్నీ......నిజంగా రెండేసి గలాసు లేసుకున్నారో నేదో కాని సావిడంతా సివాలు తొక్కేత్తుండారు. ఈయురవగలాసు లమాంతంగా నాయాడ ద్రాగుద్ది నాలుగు. తాగి నిలఁబడతాది కలఁబడతాది (నిష్క్రమించును)

[తెర పడును.]



# ఘోర్రాసైలున

అను,

## పతిసేవ నాటకము.

### ద్వితీయాంకము — ప్రథమరంగము.

[ప్రదేశము .— దేవాలయము వీధి]

(పట్టువస్త్రములు ధరించి, పూజోపద్రవ్యములతో మార్తాండమూర్తి హైమవతియుఁ బ్రవేశింతురు.)

హైమ—నాథా! ఇంకను నెంతదూర మేఁగవలె? ఆవిశ్వేశ్వరుని, పాదసన్నిధిఁ జేరుటకు?

మార్తాం—దాపునకే వచ్చితిమి

చ॥ అతివరో! కాంచుమా యదిగో ♦ నంబరచుంబితమూర్తివంతమై
కుతుకము తోఁపఁ జేయుచును ♦ కుంభిని నొప్పెడు దేవళంబునా
సతతము నిల్చి దేవుఁడట ♦ సాంబుని పేరిట సాధులోకులై
వెతలను బాపి బ్రోచు నఁట! ♦ వేఁడినయంతనె భక్తవర్గమున్.

ఎంతదూరమైనను మనకది విసువనిపించునా?

హైమ—ఏకష్టము లేక దూర మేఁగకయే యతిసులభముగ సంతోష దాయకముగ దేవునికన్న మిన్న యామూర్తినిఁ బ్రసన్నము చేసు

కొనుమార్గము నాదేవుఁ డిదివఱకే నాకుఁ బ్రసాదించి యుండ నీవు డింతదూరము వచ్చి ప్రయాణశ్రమలకు నోర్చి మిమ్ములను గష్టపెట్టుట నాకు నెంతమాత్రము నిష్టము లేదు.

మార్తాం—హైమా! అతిలౌక్యముగ మాట్లాడు చుంటివి. నీకు విగ్రహారాధన యన నిష్టము లేదే? అట్లయిన నీయత్తగారిపట్టువలననే యిందు రాఁ గడంగితి వన్నమాట!

హైమ—ఇష్టము లేక కాదు. నాథా!

ఆ॥ వె॥ వేయిసార్లు దేవు ♦ వేఁడుటకంటెను
భక్తితోడ నాత్మ ♦ భర్తఁ జుట్టి
యొక్కసారి తిరిగి ♦ మ్రొక్కినఁ జిక్కును
సర్వసౌఖ్యములును ♦ సతికి నిలను.

అనుపలుకు ననుసరించి చూడ నీవిగ్రహారాధనకన్నను, స్వచ్ఛమైన భగవంతునకుఁ జేసిన సేవకన్నను, నధిక మైనమీపాదసేవ నన్నుద్ధరింప సిద్ధముగా నున్నప్పుడు నింతశ్రమపడి మిమ్ము నింతశ్రమ పెట్టుట యేందు కని

మార్తాం—(చిఱునవ్వునఁ దనలో) ఓహో! ఏమి యీమెపతిభక్తి! కాని యిప్పుడే మైనది? (ప్రకాశముగా) బాలా! శ్రమ యేమున్నది. ఎంతశ్రమ పడి యైనను భార్యలమనోభీష్టములు భర్తలే తీర్ప వలెను గదా! విగ్రహారాధనవలనఁ గొండొకలాభ మున్నది; ఎంతకఠినస్వభావునకు నయిన నెంతచంచలస్వభావునకు నైన నెంత దుర్మార్గునకు నైన దేవాలయములోనికిఁ జొచ్చినంతనే నిర్మలత్వమున స్వచ్ఛ మైనమనస్సుఁ గలుగ నొక్కత్రుటికాలము ధ్యానించినఁ జాలు నుత్తీర్ణుఁ డగు ననుకొని పెద్ద లీదైవములను సృష్టించిరి.

హైమ—ఔను; కా దన్న వా రెవరు? సతులకుఁ బతిసేవయే యుత్తమ మయిన దను చుంటిని.

శివరావు—(ప్రవేశించి) హోయి! హోయి! ఈమధ్య నొక నెలనుండి మా వ్యవహారము చాలా హేపీగా నున్నది. హేపీగా నుండ కేమి? "ధనమూల మిదం జగత్తు" నినట్లు జేబు నిండ ధన ముండి యింటి నిండ సారాబు న్డుండి వారమునకు నొకక్రొత్తసాని మారుచుండి సర్దా గలఫ్రెండ్సు సాయము గా నుండ నంతా హేపీయే! అప్పుడే పట్టు తప్పునట్టుగా నున్నది. కావున వడివడిగా నింటికిఁ జేరినఁ గాని గ్రేండుగా నుండదు. ఈదిన మెపాడు వేళను బయలు దేరితినో కాని వెళ్లినపని యయినదే కాదు.

మార్త్తాం—(శివరావును చూచి మందహాసముతో) ఓహో! యెవరో యని చూచు చుంటిని మిస్టర్ శివరావు కమింగ్!

శివ—(విని సంతోషముతో) హల్లో! ఫ్రెండ్! గుడ్డ్ఈవినింగ్ గుడ్ఈవినింగ్! (సమీపించును.)

మా౦త్తాం—షేక్ హేండు (అనుచు నట్లుచేయును) శివరావు! మీ నాన్నగారిచే నే వచ్చినదాదిగా నన్నివర్తమానములు పంపించితిని, ఒక్కసారి యైన దర్శన మిచ్చితివి కాదేమయ్యా!

శివ—(తనలో) మన మస లింట నున్నఁ గదా వర్తమానము లందుటకు? (ప్రకాశముగా) నీవు వచ్చినసంగతి నాకు నిన్ననే తెలిసినది ఇదివఱకుఁ దెలిసినచో వాయువేగమున నీయొద్ద వ్రాలకుందునా?

మార్త్తాం—మీనాన్నగా రిదివఱ కేప్పుడుఁ జెప్పనే లేదా?

శివ—(విసువుఁదలతోఁ దనలో) మరల నదియే ప్రశ్న!

మార్త్తాం—నిన్ననే మీయింటికి రా వలె ననుకొంటిని అంతలో మాయమ్మగారు గౌరీవ్రతముఁ దంపతసహితంబుగాఁ జేయు మని నియమించిరి. రేపె తప్పక నిన్ను కలిసికొన సిద్ధముగా నున్నాను. అంతలో నీవే యిక్కడఁ గాన్పించితివి.

శివ—బ్రదర్ ! మనబాల్యస్నేహము మొదట నుండి యిందాక నింతయమోఘముగ వ్యాపించుటకు హేతువు పూర్వజన్మసుకృతమే యయియుండ నోపు !

మార్తాం—రైట్ ! కానియున్నచో నిన్ను విడిచి నేను కలకత్తాలో ఎం. ఏ. చదువుటకుఁ బోయి టూయియర్సు ఆపురమున నుండి చాలదగ్గాగాఁ గాలము వెళ్లఁ బుచ్చుచు

తే॥ గీ॥ అద్భుతవిచిత్రములు పెక్కు ♦ లరయునపుడు
నన్యాధిక వైభవంబుల ♦ నాదినపుడు
మఱవఁ గంటి నేమొ సఖ! నా ♦ మాతఁ బితను
నామనోగోచరుఁడ వీవె ♦ నమ్ము నెమ్మి

కాని ఈమధ్య నే నెన్ని లెటర్సు వ్రాసినను మఱల నీయొద్దనుండి రిప్లియే రా లే దేకారణముననో ? ఊఁ రమ్ము దేవాలయమున కేఁగి దేవుని దర్శించి యింటి కేఁగుదము.

శివ—(తనలో) ఈతనికిలిదంగుణములు నానడపడికలన్నియు బాగుగా నెఱిఁగినవా రగుటచే నిప్పు డీతనివెట వీరియింటి కరిగినచో మా స్నేహమునకే చేటు సంభవించును.

మార్తాం—మిత్రమా ! యోచింపు చుంటి వేమి? రమ్ము పోవుదము.

శివ—నే నిపు డొకయర్జంటుపనిమీఁద బజారునకు వచ్చినాను, త్వరితముగా నింటికిఁ జేర వలెను, కాఁబట్టి మీపరాస్నన కీనైటునఁ దప్పక వచ్చి నిన్ను కలిసికొందును.

మార్తాం—కలిసికొనుటయే కాదు ఈనైట్న మీల్సు మాయింటనే స్వీకరించ వలయును.

శివ—యాస్. అభ్యంతరమా ? పీ లైన నల్లే.

మార్తాం—మరి మేము వెళ్లి వచ్చెదము. (నడుచు చుందురు.)

శివ—మంచిది. (తనలో) స్నేహితు లనఁగా నందఱు స్నేహితులా ?

ఇతఁడే స్నేహితుఁడు. ఇతని గ్రామముగా గ్రంథములోనకు దింపిన దో నాజన్మసాఫల్యమైన దన్న మాటయే కాని యతిసులభముగ చూఁడువాఁడు కాఁడు. పరమభాగ్యదసుఁడు. కా నిమ్ము. (అని తల పంకించుచు నిష్క్రమించును).

హైమ—నాథా! ఆయన యెవరు?

మార్తాం—ఆతఁడు నాప్రాణ మన్నమాటయే? నాక్లాస్మేట్. మేము చదువుకొనునపుడు వ్యక్తులు రెండు కాని యాత్మ లొకటి కానే సంచరించెడువారము. నాబాల్యమిత్రుఁడు. మనచంద్రమౌళిశాస్త్రి గారికుమారుఁడు.

హైమ—ఆహా! మనమాటలసందడిలో నెంత త్వరితముగా విశ్వేశ్వరునిసన్నిధిఁ జేరితిమి? ఎంతయున్నతప్రాకారము! అహాహా! నానావిధజీవసంఘంబులును జీవించియున్నవానిఁ బోలె శిల్పికారులచే నిర్మింపఁబడి నేత్రోత్సవంబొసంగుచు నిట్లొప్పుచున్న యీగోపుర వైభవంబును వర్ణింప నావశము కాగు కదా!

మార్తాం—రమ్ము ప్రాకారమును దాటి లోన కేఁగుదము. (నిష్క్రమించి మరియొకవైపునుండి ప్రవేశింతురు.)

మార్తాం—హైమా! చూడు మిచ్చటఁ గలవిభవమును

సీ॥ సాంబశివా! భర్గ ♦ శంభో! భవా! యని
సద్భక్తి భజనలు ♦ సల్పువారు
హర! హర! మహనీయ ♦ యనుచు జేగంటల
వాయించి సాష్టాంగ ♦ పడెడివారుఁ
కైలాసగిరివాస! ♦ గౌరీరమణ! యంచుఁ
జేతు లెత్తి నతులు ♦ చేయువారు
ముక్కులు మూసియు ♦ మూలఁ గూర్చుండి కం
దర్పాంతకుని మదిఁ ♦ దలఁచువారు

తే॥ గీ॥ గల్గఁ గనుల కానందముఁ ♦ గల్గఁ జేయు
చున్న యీపవిత్రకృతిఁ గనులఁ ♦ గన్న నెట్టి
పాపుఁ డైనను నింతలో భక్తుఁ డగుచుఁ
గరుణఁ బాలింపఁ బడుఁడె శం ♦ కరునిచేత

హైమ—ఆలస్య మేల ? మనముఁ గూడ వారితోపాటు దేవదేవు
నారాధింతము రండు.

మార్గాం—నడువుము.

(పాడుచు నిష్క్రమింతురు)

(తెరపడును.)



# ద్వితీయాంకము—ద్వితీయరంగము.

[ప్రదేశము:—రాజవీధి ప్రవేశము శ్యామల, శివ, భాస్కర,
దుర్గారావులు—కొంతవఱకు నడిచి...)

శ్యామ—ఇదిగో ! నిదే నోయి మన మనుకొను చున్నరమణయ్య
షాహుకారుమేడ, యేవీ యానోట్లు ?

శివ—ఇవిగో (జేబునుండి తీసి యిచ్చును)

శ్యామ—(పుచ్చుకొని) మీరా రాకాఫీహోటలులోఁ గూర్చుండుఁడు.
పయిమినిట్సులోఁ దిరిగి వచ్చెదను. (అన శ్యామలరా వొకవైపునకును
గడమవారంద ఱొక వైపునకును జనుదురు. అంతఁ దెర లేవ రమ
ణయ్య శెట్టి యునపపెట్టెప్రక్క వ్రాతబల్లయొద్దఁ గూర్చుండి కను
పట్టును.)

రమ—అమ్మయ్యా! ఇప్పటికి తీరి కయ్యింది యింటిలో కాలెట్టడానికి. గుమస్తాముండాకొడుకునొకన్ని తగలేద్దామంటే గుట్టంతా బట్టబయిలు చేస్తాడని బయ్యం. యెదవగుట్టు. గుట్టు కేమి కాని చేసుకున్నది రెండోపెళ్లి. అదీ గాక మాయావిడ యితరకోమట్లలాగ వికృతాకారాలు లేక యెఱ్ఱగా బుఱ్ఱగా వుండటంచేత మరీ చేటొచ్చింది. పూర్వ మెప్పుడో కన్యకాపరమేశ్వరి యిచ్చినశాపం వల్ల కోంవుట్లకు కోతుల్లాగో యెలుగుగొడ్లులాగో యేదుపందుల్లాగో యెదవరూపు లొచ్చిన వని పెద్ద లంటారు. దా న్నణిసిపెట్టి మాయాడోళ్లు తెలివితేటలువల్ల రంగు మాట్చి క్రిమంగా రాణింపులోకిం దీసుకొ స్తున్నారు. యేమొగోం డైనా నామేద కేసి జూస్తేనే నాగుండు గుటుక్కు మనేటప్పుడు యెదురొమ్ము మీందకుంపట్లాగ జీతగా న్నెట్టు కుంటే నాయెవ్వారం యెలికిలిం బడిం దన్నమాటే. (వ్రాయుచుం గూర్చుండును.)

నీలకంఠస్వామి—(పాడుచుం బ్రవేశించి రమణయ్యసాహుకారు గుమ్మమునొద్ద నిలిచి) ఓధర్మరాజా! నేను కడుదప్పితుండనై యుంటిని. దోప్పెండుమంచినీరుం బోసి పుణ్యముం గట్టుకొనుంము. ఓ అయ్యా!......ఓఅయ్యా! దాహాము!

రమ—(కోపమున) ఎవ రది? నీకు జ్ఞాన ముందా లేదా? నే నీవలం జేసుకునేపనేవిటి పీనుంగుముందర బాకాలాగ నీయూరు పేంటి?

నీల—జ్ఞానము లేక పోవుటకు నేం జేసినదోస మేమి? సన్యాసి నగు నేను దప్పి గొని మిమ్ము యాచించితిని. దానికే యింతయాగ్రహామా!

రమ—కోప మేంటి నీబొంద. మణిసివా? దున్నపోతువా? ఊరిదిండా చెఱువు లుండంగా మమ్మల్ని పీక్కు తింటావేం? నీకు కళ్లున్నాయా లేవా? మా మేడం జూడం గానే నీకళ్లు పొక్కినియ్యి కాంవోసుం-

పో- నీళ్లు నిప్పులుఁ దెచ్చి యిక్కడ నెవ్వఁడూ దాఁచఁ బెట్టలేదు పో కింకా నిలబడ్డావేం? పోక పోతే సూడు నాదసలు పిచ్చికోపం వచ్చిం దంటే మరి తిరగదు. ఓహో! (తనలో) ఏం టివ్యాదన బెల్లం గొట్టినరాయిలాగ మాట్లాడకుండా కళ్లలంగ గుడ్లగూఁబ లాగ మిటకరిస్తున్నాఁడు? కొంపఁ దీసి మీఁదఁ బడఁడుగందా! యెందు కయినా మంచిది. పెట్టితలుపు లేసేస్తా. (అని అట్లు చేయును.) ఓరబ్బో! యియ్యాదవ మొఱ్ఱుసులా గట్టి నిలబడ్డాఁడు. యంత్రగాడులాగున్నాఁడే? సన్యాసోళ్లిని సచ్చినా నమ్మఁగూఁడదు. మాయింటిదాన్ని పిలుద్దునా? అబ్బా! సమయాని కేసచ్చినోఁ డగపడఁడు. (ప్రక్కకుఁ జూచి ప్రకాశముగా) యేఁవయ్యోయ్! నిన్నే ఓయి! మాటాడవే? నే నాంబోతులా గారుస్తున్నా నీ కినపడ్డం లేదూ? ఓరయ్యో! ఈ డింకెలా పోయినా సరే దానిపనేంటో దాందే కాని ఉలకదు పలకదు. ఎన్నింటి కని యేడ్వను? యింకొకక్షణ మూఁలుకుంటే యీఁడిక్కడ మట మేసుకుని కూకునీలా గున్నాఁడు. తలుపు తెరిసేటప్పడికి దాఁపురమైనా వేరా దరిద్రపుముండాకొడకా? (అనుచుఁ గంగారుపడు చుండును.)

శ్యామ—(ప్రవేశించి చిఱునవ్వున నొకప్రక్కను నిలువఁబడి తనలో) చచ్చినను సరియే కాని దోసెఁడు మంచినీరు వానికిఁ బోయఁడు. ఇట్టి పిసినిగొట్టుపీనుఁగుల నేమి చేసినను దోష మనిపించుకొనదు. (చరఁజర నెదుటకు వచ్చి) షాహుకారుగారూ!

రమ—(బింకముగా) ఎవరు మీరు? ఏమి కావాలి?

శ్యామ—(తనలో) అబ్బా! ఏమి ధైర్యము? (ప్రకాశముగా) చిల్లరేమైన నున్నదా!

రమ—(తనలో) చేరినియ్యిరా దేవుఁడా గుండెలు గూటిలోకి (పైకి) బాబూ! ఏమాత్రం చిల్లరి కావాలి మీకు?

శ్యామ—ప్రస్తుత మొకట్వింటీరూపీసునకుఁ గావలెను. మారక మెంత?

నీల—(తనలో) ఆహా! భారతభూమి నెట్టిచీడపురుఁగులు ప్రాకుచున్నవి!

రమ—అయ్యా! మీరు క్రొత్తోరు గనుక పదిరూపాయలకు వక్కపావులా మారకము. ఇవి ఊడుపులరోజులు చిల్లరి లేక రైతులెంతచిక్కు పడు చున్నారో తెలుసునా?

శ్యామ—అట్లా! (తనలో) ఈవిధవకు ముందు కొంచెము రుచి తగిలించినఁ గాని గాలమునకు సరిగాఁ దగులుకొనఁడు (ప్రకాశముగా) శెట్టిగారూ! మీరు న్యాయముగా నందఱియొద్దఁ దీసికొనునట్లుగా నాయొద్దఁ గూడఁ దీసికొనుఁడు (నోట్లు నిచ్చును)

రమ—అద్దిగదీ వరస? అలాగ తెం పుండాలి. పదిరూపాయలకుఁ బావలా మారకం రివాజే. కావలిస్తే సద్దులబుక్కు నెత్తిమీఁదెట్టుకుని ప్రమాణకం జెయ్యమంటే జేస్తా

శ్యామ—అక్కె! అంతపని యెందులకు? నిత్యసత్యనియతు లని నాకుఁ దెలియును.

రమ—అంతే అంతే. అలా గని ఆవిలబడ్డామన్న పోతుకు కాంతగ పెట్టుఁడి బాబు? (చిల్లర లెక్కపెట్టి యిచ్చును)

శ్యామ—(తనలో) పాపము దయఁ దలంచి వానికిఁ గడ్డి పెట్టు మంటివి కాని మేము నీకుఁ బెట్టెడిది జిగురుముద్దరా! ఫూల్ (పైకి) పాపము! వానికిఁ గొంచెము మంచినీ రిడఁ గూడదా?

రమ—కాదడ దని యేగాడి దంటాఁడు. మీ రింకా సత్రికాలాన్ని విడిచి పెట్టలే దనుకుంటా! యీఁడిసాధు వేసం జూసి కాస్నెఘ్న ఈడిమొకాన్ని వగలేద్దా మని లోపలి కెలితే ఇక్క డున్నలంజే జేడి సంకను పెట్టి లేడయ్యి పోయామా?

శ్యామ—అందఱు నట్టివారే యుందురా!

రమ—పైకి మనవలె మంచోఁడులా గుండీవోఁడే క్షణంలోఁ గొంపలు మాపెయ్యడం

నీల—ఓరిమూఢ వైశ్యుఁడా !

రమ—మాటలు మిగుల్తా వేఁవిరా గాడిదా !

నీల తే॥గీ॥ మిథ్య సంపదల్ భోగముల్ మిథ్య ప్రాణి
మిథ్య సర్వము మిథ్యయే తథ్య మేది
యీశ్వరవిలాస మెట్టిదో యింత యేటి
కిఁక క్షణంబున కెవ్వరి కేమి యగునో!

ఈయనిత్యప్రపంచమును నిత్య మని నమ్మి యున్ననీకుధనమత్త లుబ్ధత్వములచే నేత్రములకుఁ బొరలు గ్రమ్మి యేమియుఁ దెలియుట లేదు. నీవు జ్ఞానమును శీఘ్రకాలములోనే యితరదుర్మార్గులమూలమునఁ దెలియఁ గలవు. నీలుబ్ధత్వమే నీయాశాపిశాచమే నిన్ను మహోహ్రదమ్మునఁ బడఁ దోయును. నిరాశాపరుఁడవై లుబ్ధుఁడవు కాక బుద్ధి గల్గి నెగడుము (పాడుచుఁ జనును)

రమ—పోరా ! గాడిదికొడకా ! అడుక్కుతినేముండాకొడుక్కికూడా చాల్లంతా కోపమే. మొత్తముమీఁద శనిగ్రహములాగ వదిలేవంతే సాలు యీదఫా నాగుమ్మంకాడి కొచ్చి చూడు మరేమి జేస్తానో

శ్యామ—సాహుకారుగారూ! మీకు వీలు లేకున్న నే నేదైనసహాయమాత్రనికిఁ జేసెదను లెండు. మరి నాకు సెలవు

రమ—మంచిది బాబూ! మంచిది తాకట్టుపద్దు లైనా తణకాబాపతు లైనా మీద్వారా యేఁవన్నా వుంటే పోనివ్వక తీసుకు రండి.

శ్యామ—అభ్యంతర మేమి? అల్లే (కొంచెముముందున కేఁగి) ఈమధ్య గవర్నమెంటువారికన్నులలోఁ గారము జల్లి బ్రెయిన్ గలవారు కొందరు ఇమిటేషన్నోట్లను సృష్టింపఁ గల్గిరి. అట్లు సృజించినవారి

కందఱకు శ్రీకృష్ణజన్మస్థానమును జూపించుటకై దొరతనమువారు తీసికొని వెళ్ళిరి కాని యానోట్లగోలమాత్ర మింకను నణంగ లేదు. ఇప్పుడు నాచే మాఱ్పఁ బడినయీనోట్లాబాపతు వేమో యనుసంశయం బీతనికిఁ గలుగనట్లు నే వర్తింప వలయును. (నిష్క్రమించును)

నీల—(పాడుచుఁ బోవు చుండును)

శ్యామ—(వెనుక నుండి) ఓయాచకా! అట నిలువుము (దగ్గఱకు వెళ్ళి) ఆపిసినిగొట్టుపీనుఁగు నీకోర్కె లేమి తీర్పఁ గలఁడు. ఈ రూపాయఁ దీసికొని స్వేచ్ఛగా వ్యయపెట్టుకొనుము (ఇచ్చు చుండును)

రమ—(వారివంక తెప్ప వాల్పక చూచుచు నాశ్చర్యముగా) యేంటిది? రూపాయలు రూపాయలే ధర్మం జేస్తున్నాఁ డీయన!

శ్యామ—ఊఁ... కై కొనుము (ఇవ్వఁ బోవును)

నీల—వలదు నాయనా! వలదు. ఈవిరాగునకు స్వేచ్ఛ లేనిసమయ మెండు కలదా! పొరఁ బడు చుంటివి ఈధనమువలన నీవు కాని నేను కాని యితరులు కాని యనుభవించునది స్వేచ్ఛ కాదు. ఘోరరౌరవాదినరకము; తెలిసినదే? ఇప్పు డనుభవించు సౌఖ్యము స్థిరము కాదు. ముం దున్నది మునుళ్ళపండుగ

శ్యామ—(కోపమున) ఊఁ- ఏమీ రాస్కెల్! నీవు చెప్పువాక్యముల కన్నింటికి మౌనము వహింప జోస్యదండకముఁ జదువు చుంటివే! ఓరిజోగులూ! ఇది పాపపుసొమ్మనియా నీయూహా! ఎంత టెక్కురా! (తన్నును)

నీల—హారహా రా! ఓరిపాపుఁడా! (ఏమో అను చుండ)

శ్యామ—నోరెత్తకురా ఫూల్? మాగ్యేంగు నీజడ లూడఁ బెఱుకఁ గలదు

నీల—ఆఁ-ఏమిపోగరు? మీరు చేయుకృత్రిమములకు మీరు చేయు ఘోరకృత్యములకు మీరు నడిచెడునడతలకు స్వల్పకాలము లోనే ఫల మున్నది. మేమే మొనగాండ్ర మని విఱ్ఱవీగ రాదు సన్యాసి నగుసన్ను తన్నినందునఁ గొలఁదికాలముననే సన్యాసిపాద ములకే సాష్టాంగపడవలసి వచ్చెను. ఈమాట మనసున నుంచు కొనుము. ఒరు! శారీరమణా! (నిష్క్రమించును)

శ్యాము—పోరా! డేమిట్! (మరల లోన కరుగును)

రమ—ఈయన మళ్ళీ యిక్కడికే వస్తున్నాఁడే. యీ మొగ మింతక్రిత మెప్పుడు నేను చూచిందే కాదు. ఈనోట్లుజూస్తే కొత్తయ్యిలా గున్నాయి ఆగెడ్డపోడిగోల్లో యీనోట్లని సరిగాఁ జూడనే లేదు. (నోట్లుతీసి) కొంచెఁ దీసి యీమధ్యఁ గొత్తగా వెలిసిన దేశవాళీ రకం కాదుగందా! (బాగుగాఁ బరిశీలించుచు) చూడఁగాఁ జూడఁగా గుట్టుం గాడి దయ్యిం దన్నట్టు కాఁ గలదు. అబ్బె! నాసేవస్త్రంవే కాని యియ్యి మంచినోట్లే.

శ్యాము—(మరలఁ బ్రవేశించును)

రమ—బాబూ! ఆయెదవయెవ్వారం యిప్పుడైనా బోధపడిందా మీకు? ఆఁడడిగిం దేదో యివ్వ లేక కాదు. ఆఁడినిక్కు జూసేరా!- ఆఁడిమాట కేం గాని మీదొడ్డిలో రూపాయలచెట్టున్నట్లుగాఁ గర్చుపెడ తున్నారే.

శ్యాము—(చిఱునవ్వున) మీ రన్నమాట సత్యమే. నాకిది యొక్క లెక్కా?

రమ—అబ్బో రయ్యా! అంతపెద్దసెయ్యేం? మీరు మళ్లీ దయసేసినా రేమి?

శ్యాము—మరి ట్వెంటీ రూపీసునకు చేంజి కావలయును. (నోట్లు నిచ్చును.)

రమ—(తనలో) కొంప తీసి నాయనుమానం నిజం గానుగందా! ఇయ్యాల్టపక్క నెంబర్లే అన్నీ. కొత్తనోట్లే. (పైకి) బేంకిలో యేదైనా చెక్కు మార్చేరా యేంటి?

శ్యామ—(తనలో) కొంచెము తోవలోఁ బడినాఁ డన్నమాటయే. ఈరవులు చున్న యనుమానాగ్నిలో నాలుగెంటుసమిధలను వేసినఁ గాని సరిగాఁ బ్రజ్వరిల్లదు. (ప్రకాశముగా) చెక్కువంటిదే మార్చినాము లెండు; నా చేతులే చెక్కులు.

రమ—ఏంటీ! మీా రల్లా గంటే నాకేమి అర్థ మవ్వటం లేదు.

శ్యామ—పిమ్మటఁ దెలియఁ బరచెదను లెండు.

రమ—యిప్పుడు చెప్పఁ గూడదూ?

శ్యామ—తొందర రేల?

రమ—(చిల్లర లెక్క పెట్టి) అటయితే మరిందండి (ఇచ్చును.)

శ్యామ—(పుచ్చుకొని) థేంక్యూ! మరి నాకు సెలవు. (నిష్క్రమించును.)

రమ—చిత్రం. (యోచించి) అసలు ఇందులో వృం దేదో రహస్యం యేవ్వారం ముం దెల్లాగ నడిసినా అమాంతంగా అయిదునిము స్సాల్లో రూపాయి చేతులోఁ బడింది. ఇం కేం గావాలి!

ఆ॥ వె॥ ధనము లేనివాని ♦ దరి కెవ్వఁడును జేర
నీఁడు లచ్చికల్ల ♦ లాడి యైన
లచ్చిఁ బోగుఁ జేసి ♦ లాబము పొందుఁడు
మర్మ మిందు లేదు ♦ మసులు కొండి

(పద్దులు వ్రాసికొనుచుఁ గూర్చుండును.)

(తెర పడును.)



# ద్వితీయాంకము—తృతీయరంగము.

[ఊరివెలుపలిభాగమునఁ బ్రవేశము, విటుఁడగునిత్యానందరావు విటకత్తె నాగరత్నము విలాసముగాఁ బాడుచు.)

నిత్యా—ఇం దెవ్వరును లేరు లే, ఏదీ యిఁక నొకముద్దు. (ముద్దు పెట్టుకొనును.)

నాగ—నిముసమున కెన్నిముద్దులు! నిజముగ మనమూలమున నీతోఁ బ్రవయుంతయుఁ బావన మైన దిత్తఱిని

నిత్యా—మక్కువను బట్టి లెక్క యేమిటే? మరల నిఁకొకటి (ముద్దాడును.)

నాగ—ఊఁ...చాలును లెండు. చూడుఁడు. ఆకనపట్టుచున్న దే పట్టణము సాయంసమయ మగు చున్నది. కనుక నీ రేయి యిందుండము. ఉదయమున గమ్యస్థానముఁ జేరుకొన వచ్చును.

నిత్యా—మోహనాంగీ! మనగమ్యస్థాన మగుపుర మయ్యదియే.

నాగ—ఆహా! ఏమి మనభాగ్యము! ఈపురము మనము తిరిగినపట్టణము లన్నిటికన్న గొప్పది గాఁ గనుపట్టు చున్న దే. ఇం దేదో మూలఁ గాఁపుర ముండిన మనవారు మనలను దెలిసికొనుట కష్టమే

నిత్యా—వెఱ్ఱిదానా! ఈఁతకు మించి లోఁతుండునా? మీవారు మనలను బట్టి యొప్పగించినవారికి వేయిరూపాయలు బహుమానము నిచ్చెద మని చాలమందితోఁ జెప్పినా రఁట. వారు సి. ఐ. డీ లవలె నూరూరఁ దిరుగుచునే యుందురు. నీమీఁద ననురాగవశమున నీభర్త నాబాల్యస్నేహితుఁ డని యైన నెంచక నీయాతురత వలన నాయన్నదమ్ములకు మాతాపితలకు భార్యాపుత్త్రులకు దూ

రమై నినుఁ దగులుకొని ప్రాణములఁ జేతఁ బట్టుకొని యీమూఁడు మాసములలో నాలుగుగ్రామములు తిరిగితిని

నాగ—అయ్యో! ప్రకృతినిభంగి యట్లు వాపోయెద రేల?

నిత్యా—వాపోవుట కేమున్నది? మనయొద్ద నున్నధనమంతయుఁ గడ తేరువఱకు కేవిచారము మనయంద నుండదు. కాని యటుపైనఁ బ్రతుకుదెరు వేదియో యని నే నాలోచించు చుంటిని.

నాగ—(నవ్వుచు) మనము బయలుదేరుటకుముం దీయాలోచనకు మీకు నెన్నికోసులదూర మున్నదో !

నిత్యా—నాకే యన్నమాట యేమి? ఇట్టియవకాశము కల్గిన స్త్రీ పురుషులెల్లరకుఁ గూడఁ గన్నులకుఁ బొరలు కమ్మి బుద్ధియంతయు బుగ్గియై తాము పోవు చున్నత్రోవయే తమకుఁ దెలియక మసలుదురు.

నాగ—అట్టికర్మము స్త్రీలకుఁ గూడఁ దెచ్చి పెట్టు చుంటిరే? పురుషులకే యనుఁడు స్త్రీధైర్య మెట్టిదో చెప్పఁ మందురా ?

సీ॥ లేవఁ దీసినవాని ♦ చేవ పోయినవెన్క
నతని రోసి పరుల ♦ యొండఁ జేరు
మగనిప్రక్క నె అంకు ♦ మగనితో నుండెడి
ఘనధైర్యవతులును ♦ గలరు భువినిఁ
దీర్ఘయాత్రలపేర ♦ దీవులన్నియుఁ జొచ్చి
కఱవుఁ దీర మగలఁ ♦ గట్టుకొనును
నాటకముల కేఁగి ♦ నటచూపరులఁ జూచి
యింటికి రప్పించ నెంచఁ ♦ గాంచఁ

తే॥ గీ॥ గలరు కాని చీమకు నైన ♦ గాలి నుండు
దోమ కయినఁ దెలియ నీక ♦ ధూర్తకృతుల
నభిమతముఁ దీర్చుకొనియెడు ♦ నతివలఘన
ధైర్య మేప్రాణికి నెఱుఁగఁ ♦ దరము కాదు

నిత్యా—నీవుఁ గూడ నంతసాహసవంతురాలవే! అట్లయిన మనయొద్ద ధనము కడతేరినపిమ్మట నీవు చేయఁ దలంచుకార్యము లివియా యేమి ?

నాగ—(దనలో) ఈవెఱ్ఱిమొగము ఇది శాశ్వతమె యనుకొను చున్నాఁడు కాఁబోలును! పుస్తె కట్టినవానిపాలిపే నిత్యము కాన ప్పుడు పైపైరకములపాలిపా స్థావరము! నాలుగుబాపతులనాడె ముఁ జూడ వచ్చు ననియే కదా! జమీందారుకుటుంబము నుండి జంకు లేక లేచి వచ్చితిని.

నిత్యా—మాట్లాడ వేమే! కొంపఁ దీసి నీది యట్టిసంకల్పమా యేమి? నిన్ను నమ్మి కొండంతసంసారము విడిచిపెట్టితినే! నీచేతికూడుఁ దిని

నాగ—పుచ్చకాయలదొంగ యనఁగాఁ గుచములు తడిమి చూచు కున్న దఁట యెవ్వతో-అలు కున్న దానికి నులు కెక్కువ యన్నట్లు నే నీకాలము స్త్రీలచరిత్రి చెప్ప మీా రట్లు వగచెద రేమి ?

నిత్యా—అంతమాత్రిమే కదా

(అంత శ్యామల, శివ, భాస్కర, దుర్గారావులు తూలుచుఁ బ్రివేశింతురు)

శ్యామ—అరే! ఆఁగండిరా! అఁలు చూాపఁడు?

శివ—ఒహ్హో! అవునురో వాలిం దేదోపెట్ట ఊరిమీాఁద!

దుర్గా—అట్లయినఁ జూాపఁడు మనభుజపంజరములోఁ బెట్టుదము.

భాస్క—పాపము దానియొక్క మగఁడు కాఁబోలునురా!

శ్యామ—నాన్ సెన్సు... కాదురా!

శివ—ఔను. సతీపతులిరువురు నేతీర్థయాత్రికో బయలు దేరినారురా!

శ్యామ—అది యాతనిదగుధర్మపత్నియైన నంగములు కనిపించునావా యిలుసిల్కుచీర, ఆవాలుజడ, ఆమొగముమీాఁది ఫేస్ పౌడరు, ఆజబ్బలపై నుండుజాకెట్టు ఆపాదవులలోలక్సు, ఆరిష్టువాచీ ఆనడక,

ఆసవ్వులు, చూడ్కులుఁ జూచి యూతఁడు సహించునా?

శివ—సహించ కేమి. ఇల్లాం డ్రియినయువతుల కీచేష్ట లిష్టము కాక యూఱ కున్నచోఁ బట్టు పట్టి కొట్టి యైనఁ దమయొక్కసతులచే నీపనులు చేయించుచవట లున్నారు.

శ్యామ—ఉండిన నుండ వచ్చును, కాని యిదిమాత్రి మట్టిది కాదు. ఇంకను బాగుగాఁ దిలకింపుఁడు

సీ॥ ఓరపాపట తీసి ♦ యొప్పుగాఁ గొప్పును
దువ్వియ మురిసెడి ♦ తులువఁ గనిన
స్తనములపైఁ బైఁటఁ ♦ జారుగ జారిచి
యటు నిటుఁ దిరుగు నా ♦ య్యారి నరయ
గుబ్బలు పెరవారి ♦ గుడ్డిలోఁ బకులాగు
స్క్వార్ నెక్కుబాడీని ♦ చేర్చు టరయ
గాజులు చేనిండఁ ♦ గలిగిన ధ్వని ఘని
రిస్టువాచీనె సం ♦ ప్రీతి నుంచి
తే॥ గీ॥ బుద్ధిఁ గల్కిసపురుషుల ♦ బూదిఁ గలుప
నవగారించినచిత్తిసీ ♦ యంకురంబు
సతి యటంచు వాదించినఁ ♦ జవటలు కద
లంజయే సత్యమానారి ♦ లంజ లంజ

శివ—ఎవ రైన మన కడ్డ మేమిరా ?

శ్యామ—అట్లయిన మీరు కొంచె మవలకుఁ బొండు. నేను వారిదరి కేఁగి కథ నడిపించెదను

శివ, భాస్క, దుర్గా,— (నిష్క్రమింతురు)

శ్యామ—(వారికడ కేఁగి) సర్ ! మీయొద్ద మేచ్ బాక్సు కలదా ?

నిత్యా—ఉన్నది. ఇదిగో (ఇచ్చును)

శ్యామ—థేంక్యూ ! థేంక్యూ ! సిగరెట్టుపెట్టె విప్పి తా నొకటి

నోటఁ బెట్టి యింక నొకటి తీసి) కాల్చండి సార్ ! (అని నిత్యా నందరావున కివ్వఁ బోవును)

నాగ—(క్రేగంటఁ జూచుచుఁ దనలో) ఆహా! యెంతసొగసుకాఁడు!

నిత్యా—వలదు నాయొద్ద నున్నది

శ్యామ—అహా!...! కాల్చండి సార్ ! (ఇచ్చును)

నిత్యా—(సిగరెట్టు నోటఁ బెట్టుకొనును)

శ్యామ—(తనసిగరెట్టుఁ గాల్చుకొని నిత్యానందరావుసిగరెట్టును గూడఁ దానే వెలిగించుచు నాగరత్నమును దేరిపారఁ జూచు చుండును)

నాగ—ఆహా ! యెంతచక్కనిమోము ! (శ్యామలరావును జూచు చుండును)

శ్యామ—ఓహో ! మిమ్ము మఱచితినే (ఒకసిగరెట్టుఁ దీసి) మీరుఁ గూడ ఊఁ. కాల్చండి (నాగరత్నమున కివ్వఁబోవును)

నాగ—(నవ్వుచుఁ గొంచెము వెనుకకుఁ దగ్గి) నే నెప్పుడు యెఱుఁగ నమ్మా ?

నిత్యా—(ఆశ్చర్యమున) ఏమి టీచొఱన (చేయి పట్టి లాగి) ఏమయ్యా! నీ వెక్కడో మర్యాదావిహీనునివలెఁ గనఁబడు చుంటివే ! చాలును లే ఈసరి కైన దయచేయుము వేగమె.

శ్యామ—అరే ! ఫూల్ ! చేయి పట్టి లాగెదవుగా జాగ్రత్త.

నిత్యా—నాజాగ్రత్త కేమి కాని మరల నాఁడుదానియొద్ద కేఁగినచో సీమండలు విఱిగిన వన్నమాటయే

నాగ—తెలియక వచ్చి యుండ వచ్చును. పో నిండు.

శ్యామ—అబ్బా ! యెంతటొంపరు! ఆమెయొద్దకు వెళ్ళుటయే కాదు. వెళ్ళి ముద్దాడెద నిపు డేమి చేయుదువో చేయుము. (నాగరత్న మును ముద్దు పెట్టుకొనును)

నాగ—ఆఁ ఆఁ ఏమి సాహసము! నీభార్య ననుకొంటివా యేమి పలుగా!

నిత్యా—(మహాకోపముతో) ఓరిదురాత్మా! సూటిగా వచ్చి దబ్బన మైతివే (చేతితోఁ గొట్టుచును)

శ్యాము—ఓఁ...అహో! గుండెలు చీల్చెదవురా రాస్కెల్! (కలియఁబడి పోరాడుచు) మేక్ హేస్ట్ మైఫ్రెండ్స్! హారిఅప్ అర్జెంట్ ఎమర్జెంట్ (అని కేక వేయు శివ, భాస్క, దుర్గారావులు పరుగున వచ్చి నిత్యానందమును బట్టుకొని కొట్టుచుందురు)

నాగ—అయ్యయ్యో! యేమి యీయన్యాయము! (నిత్యానందమును విడిపింప వారితోఁ గలియఁబడి విలపించు చుండును)

శ్యాము—(నాగరత్నమును చేయి పట్టుకొని నిల్చును)

శి, భా, దు—(రావులు నిత్యానందమును పట్టుకొని కదలకుండఁ జేయుదురు)

శ్యాము—ఓరిఫూల్! మనసంగతి బోధపడినదా! హి, హి, హి ఈ విధవను అర్జెంటుగా నూరు దాఁటించి మనహాసునకుఁ గ్వారిత ముగఁ దిరిగి రండు నే నీకాంతను సంతసముగా మా యింటికిఁ దీసి కొని వెళ్ళెదను (అని నాగరత్నము నమాంతముగా నెత్తుకొని పోవును)

నిత్యా—(విచారముగా) హా! పొలతీ! నీ వీదుర్మార్గుల బారిఁ బడి పోవుచుంటివా? ఇప్పుడు నా కింకేదిగతి? అయ్యయ్యో!

తే॥గీ॥ అగ్నిసాక్షిగఁ బరిణయం ♦ బాడి నట్టి
యువిదబ్రియసుకున కెంతయో ♦ యుసురు పెట్టి
మనుపు నమ్మి నే నీధూర్త ♦ మగువఁ గూడి
వరుస రెంటికిఁ జెడిన రే ♦ వడిన యైతి

ఆహా! లోకమున రాక్షసులఁ బోలు నెట్టిక్రూరకర్ము లుద్భవించు చుండిరి! (తన్నుద్దేశించుకొని) ఛీఛీ! గుఱివెందగింజ యడుగునఁ గలనలు పెఱుఁగ దనునట్లు లిట్టిఘాతుకకార్యమునకె సాహసించిన నీచుఁడ నగు నేనా యొరులను నిందించుట?-వీరి నన వలసినపని యే మున్నది? ఆతోత్తు ముందే యెఱింగించినది స్వమనోనిశ్చయమును. పరమాత్మునివంటి స్వభర్తనే విడనాడి నావెంటఁ బడినయాపాపు రాలా! నన్నుద్ధరించుట? నేనెంత వెఱ్ఱి నైతిని (మరికొంత నడిచి) ఓసర్వేశ్వరా! ఈదుర్మార్గునకు సరియైనశిక్షనే విధించితివి. ఈపా టున కేమి కాని యీపాపాత్మునకిఁక ముం దెన్నిబన్నములు రా నున్నవో? రాక మానునా!

సీ॥ వరనీతిపరుగతిఁ ♦ బరఁగి నెయ్యులయింటి
గోలలం గూడెడి ♦ కూళతనము
తల్లివావులుఁ గల ♦ తరుణుల నైనను
గేళిఁ గూడించెడు ♦ మాలఁదనము
బాగొప్పఁ బతిలోడ ♦ బ్రీతి కెడువనితకాఁ
పురముఁ జెరపఁ బొందు ♦ మొఱకుఁదనము
వీలు చిక్కినయెడ ♦ గోల యుత్తమ యైనఁ
బల్మినిఁ బట్టెడి ♦ పాపితనము
తే॥ గీ॥ ఊఱకే పోవునా? పోదు ♦ ఘోరరౌర
వాదినరకబాధలఁ బోలు ♦ నమితకష్ట
ములఁ గుడిపి కుడిపి మడఁపు ♦ ముందుగతిని
జూపకే యిహమునఁ గీర్తిఁ ♦ బాపు విధిగ

ఓనారాయణా! శ్రీమన్నారాయణా! దీనరక్షకా! తప్పు తెలిసి కొంటిని. రక్షింపుము తండ్రి! రక్షింపుము (చెంపలు వాయించు కొనును)

శివ—మనవలువురకు నలుగుగుసాను లుండ మధ్య నిదెంగులకురా ?

దుర్గా—దీనిని డ్యాన్సులేడీని చేయుదమురా !

శివ. భాస్క—యాస్! యాస్! అంతమాత్రమే కాక దానిమొద్ద నెన్నివస్తువు లున్నవో చూచితిరా !

నిత్యా—ఆహా! కష్టసుఖములుకావడికుండ లందు రింమలకే. పర్యేశ్వర సంకల్ప మతినిగూఢము కదా! ఓదేవా! ఈదీను నేవిధిఁ గ్రోచెదో నీయదే భారము.

ఆ॥ వె॥ నీవె దిక్కు నాకు ♦ నిజముగ లక్ష్మీశ !
వేగ వచ్చి నాదు ♦ వెఱపుఁ దీర్పు
మడలు చుంటి దేవ! ♦ యాదరింపుము యిష్ట
దిక్కు లేనివాఁడ ♦ దీనబంధు !

ఓకరుణామయా !

చం॥ జనమున నీదుపాదములె ♦ చక్కఁగ నెప్పుడు భక్తితోడుతన్
భువనవికాస! కొల్చెదను ♦ పాల్పెసలారగఁ బ్రోవు మయ్యా! ఇం
కెవనిని వేఁడువాఁడ నిఁక ♦ నెవ్వఁడు నన్నిటఁ బ్రోచువాఁడు శ్రీ
యువనిజమార్గదర్శ! భవ ♦ దంఘ్రియుగం బగు దిక్కు నా కిఁకన్

(పాడుచు నందఱితో నిష్క్రమించును)

(తెర పడును)





# ఫోర్టా సెటలుస

అను,

## పతిసేవ నాటకము.

### తృతీయాంకము — ప్రథమరంగము.

(స్థలము.—చావడి. తెర నెత్తఁగా డ్రాయరుమీఁద నాగరత్నము కొంచెము చింతగాను శ్యామల, శివ, భాస్కర, మ్గారావులు డ్రాయరుచుట్టుఁ గుర్చీలమీఁదఁగూర్చుండి కొద్దికొద్దిగా బ్రాంది త్రాగుచు విలాసముగా నుందురు.. .. ).

శ్యామ—కోమలీ! నీవు విచారించ వలసినయవసర మావంతయు లేదు. మనకు ధనమా ఎక్కువ లేదు. దర్జాయా లోటు లేదు. అందములనా? చంద్రచంద్రికలకు సమానులమే. ఏది నీకుఁ బెగ్గుఁ దగిలించినఁ గాని సిగ్గు సరిగా నిన్నొడఁ బాయదే.

శివ—యస్సాల్ రైట్! భాస్కరం! వన్అవున్సు బ్రాంది లైంజూస్ లోఁ గలుపరా!

భాస్క—(కలుపు చుండును)

నాగ—అబ్బే! వద్దండి! నా కలవాటు లేదు. అభ్యాసము లేనిదే యట్టిపనిఁ జేసినఁ దల త్రిప్పునేమో

దుర్గా—ఇట్టిమాటలు చెప్పుచునీరండశే కొంచెము చవి చూచిన నొకటి కాదు ఁదా గంటకు నాలు గెక్కించుకొందురు

శ్యామ—అబ్బే! తల తిప్పదే! చాల నుల్లాసముగ నగుచును.

నాగ—నా కావాసన యన్న మొదలే కిట్టదు. ఎట్లది త్రాగుదును.

శ్యామ—ఓసి వెఱ్ఱిదానా! (లేచి నాగరత్నము భుజముపైఁ జెయి వేసి) నీకిష్టము లేనిచోఁ ద్రాగ నవసరము లేదులే. దీని స్మెల్ చూడుము (గ్లాసు ముక్కుదగ్గరఁ బెట్టును)

నాగ—(వాసన చూచి) చక్కనివాసనయే కొట్టు చున్నది.

శ్యామ—అట్లయినఁ జక్కఁగ నెక్కఁ జేయుము (నోటఁ బోయును)

నాగ—అబ్బ! అబ్బ! గుండెలు మండు చున్నవి. (గొంతు సవరించు కొనును)

శివ—అరే! అప్పలస్వామి!

అప్ప—(లోపల నుండియే) వచ్చేసినాను బాబు! వచ్చె (మాంసపు ప్లేట్లు పట్టుకొని వేడిగా నున్నట్లు నటింపుచు వడివడిగాఁ బ్రవేశించును).

శ్యామ—ఏరా డేమిట్! యింత లేటు?

అప్ప—ఆల్సిం వేఁవైనాది బాబూ! మీకింగాన్లో నా సెయ్యి కాలి పోనాది- ఉ- ఊ- (చేతులు ఊఁదుకొనుచు లోన కేఁగి ప్లేట్లను దీసికొని వచ్చి బల్లపైఁ బెట్టు చుండును)

అందఱు—(దినుచుండుఁగ. అందు శ్యామలరావొక్కొక్క ముక్కను దీసి నాగరత్నమునోటఁ బెట్టుచుండును)

నాగ—మీరుఁగూడ భుజించుఁడి (శ్యామలరావునోటఁ బెట్టును)

భాస్క—ఎక్కినదిగో! పోర్సు (అందఱు దినుచుందురు)

అప్ప—(కొంచెము ముందున కేఁగి) వవ్వా! నారింగా! సేత్తే యిగ్గా టాళ్ళకాడనే సెయ్యాలుద్దోగఁ. యీళ్ళకాడ కొచ్చినప్పున్నుంచి

నాగురుఁడు మూఁడింటిమీఁద దాడతానే వుండాఁడు. పుల్లకల్లు తాగే నాను తాటిసారాయి కాదుగందా ఒగుటో నంబరుబరంది సిత్తుగాఁ దాగీయోగం వట్టింది. కూర్లోండఁగానే ముందుపట్టు మందే. కూరల్లో యింతకంటేకసువు నాకేటి దొర్కుతాది కాని పెద్ద పెద్ద వుద్దోగాలు సేసీబేంబర్లకీ జమీందారుకోంవుట్లుకీ కోడిపెట్టలు కోడిగుడ్లు ఉప్పుచేపతట్టాలు సాటుగా వోండిబెట్టడఁవు బరంది సీసాలు మొయ్యడుఁవు ఇల్లాంటిపని యెక్కడయినా దొర్కుతాదని సాలమందికి సరుకెయ్యించి తిప్పలు పడ్డాను కాని యెక్కడా దొక్కిందే కాదు. కోఁవుట్లు బేమ్మర్లు అండంవే కాని యీండ్రోఁడొండినా సరే మాలోఁ డొండినా సరే మూకుళ్లు మూకుళ్లే నోపటి కెక్కించు కుంతారు కాని మాలోఁడు గుల్లో కెలితే మంటలోఁ బడి సత్తాంవంటారు. మరాళ్లు దెయ్యాలికి యీళ్లు దోవుతలుకి పుట్టినారా! నానాటోఁ డొడైనా అద్దు పెట్టేఁ డంటే రంగా కింద నోడేసి నెరివేస్తునుగదా!

దుర్గా—అరే! అప్పలస్వామీ?

అప్ప—ఏం పిలిసినారు?

దుర్గా—ఈప్లేట్లన్నియుం దీసి యింతయు శుభ్రము చేయుము?

అప్ప—యింకొంచెంకూరా వూరుపూ వున్నాది వోట్టుకొచ్చేదా

భాస్క—అక్కఱ లేదు పోమ్ము

అప్ప—(బల్లలు తుడిచి ప్లేట్లుకోఁ జనును)

దుర్గా—శివరావూ! మననోట్లస్కీము నట్లే యిణఁచి పెట్టితి రేమిరా?

శివ—నే నొకఫార్సుయిటువంటి కేయుద్యమమునను బని చేయనురా!

శ్యామ—బ్రిదర్! మీరెవ్వ రీస్కీములో మరేమియుఁ గష్టపడనక్కఱ లేదు. నేనే నాటకమంతయు నాఁడుదును. మీరు కొంచెము చేయూఁతగ నున్నఁ జాలు

శివ — అటయినఁ గానిమ్ము

శ్యాము — నాగరత్నమా! నీవు భోజనమున కేఁగుము.

నాగ — మీభోజనము లైనవా యేమి?

శ్యాము — మామీల్సునకు వేళా గీళా నో. నీవు వెళ్ళుము.

నాగ — (బల్లదిగి తనలో) ముందేదెయో భయపడితిని, కాని ఆహా! యేజమీందారులును వీరికి సాటి రారు కదా! నేను వచ్చి మూఁడు దినములు కాలేదు. సుమారు రెండువందరూపాయలను వ్యయపెట్టిరి; దాని కేమి కాని యొకనికంటె నొకఁడు చక్కనివాఁడు.

(చనుచు పాడును)

దుర్గా — అక్కడ మనమేవిధమున మసలవలెనో ముందుగా రిహార్సెల్ వేసికొనవలెనురా!

భాస్క — ఊఁ. ఈమాత్రముదానికి రిహార్సలెందుకురా!

శివ — కాంబినేషన్ లేక పోయిన నెంతకష్టమురా! (సాంకేతికము మీఁద నాధారపడి నాటకములాయు ధ్వంసము చేసినట్లుగా నగును. నట్టి తెలుఁగునాటక మైనఁ గాదు. సంస్కృతనాటక మాఁడుట యెంత కష్టము.

శ్యాము — అట్లయిన వినుఁడీటు. ఈమధ్య నే నారమణయ్యసాహుకారునొద్దఁ బదిరూపాయలనోట్లను మార్చుకొనినవి యిటీవల సిద్ధము చేసినయిమిటేషన్ నోట్లుమో యని యతనికి ననుమానము పుట్టించినసంగతి మీకుఁ దెలియును గదా! మరల నే నీనాఁ డతనికడ కేగి నేనే యానోట్లను ప్రింట్ చేయుచున్నానని విప్పి చెప్పి మరి రేపటియొద్దలో రంగమునకుఁ బోవుచున్నాను. నీ కేమైన నోపిక యున్నచో వేయిరూపాయలఖరీదుగల బంగారము నా కిచ్చినచో రెండువేలరూపాయలనోట్లు నిచ్చెద నని పెద్దయాస పెట్టి యీసాయంకాలమే మనమాఱ్చు జరుగవలె నని యేసేన్

యొద్దనో యేట్రియిన్ రైలుదగ్గఱనో లేక మరి యేరహస్యస్థలమునందునో యీమాఱ్పు జరుగుసంకేతస్థల మేర్పరచెదను. అదియునుఁగాక నన్నప్పుడప్పుడు సి. ఐ. డీలు పరీక్ష చేయు చుందురు కావునఁ దయారు కాఁబడిననోట్లు నాయొద్ద నన్నుఁ బ్రమాదమని యింతకారుచవుకగా నిచ్చివేయ వలసి వచ్చిన దని కొంచెము రాజభయ మాతనిగుండె కెక్కింతును. ఆశాసముద్రమున నల్లాడువారికి నిట్టిభయములు చిఱుమీనములై ముందు కానిపించనే కానిపించవు. ఇట్లు వానిని నమ్మించి ఈలోపునఁ బదిరూపాయలకాగితములు పది క్రొత్తవి సంపాదించి మిగతనోట్ల కొకరీమువైట్ పేపరుకొని నోటుమోడలుగాఁ గట్ చేయించి వజ్జుగా నమర్చి రెండువేలు రెండుభాగములుగా విడఁదీసి వానికిరుప్రక్కలను నికరమైనపదిరూపాయాలనోట్లు రెండురెండు చేర్చి గట్టిగాఁ గట్టలను బిగించి కట్టి యుంచి మనము మాఱ్పు జెందించుసంకేతస్థలమునొద్ద నీకట్టలను భద్రముగాఁ బాతిపెట్టవలెను. ఈలోపున నేనొకకట్ట వానియొద్దకుఁ బట్టుకొని వెళ్లి వానికిఁ జూపించి గాలము వేసి చేఁపను లాగినట్లుగా బంగారము మూటకట్టించి వానిని నా వెంటఁబెట్టుకొని యారహస్యస్థలమునకుఁ దీసికొని వచ్చెదను. అప్పటికి మీరుమువ్వురును పోలీసు వేషములను ధరించి సిద్ధముగా నట నుండ వలెను. వాని నక్కడఁ గూర్చుండఁ బెట్టి పాతినకట్లఁ బైకిఁ దీసి చూపుచు ముందు వానిబంగారము నాజేబున కెక్కించుకొందును. అంతట మీరుమువ్వురు హఠాత్తుగా మమ్ములను బట్టుకొన నుంకించ వలెను. నేను మిమ్ములను జూచినతోడనే యాకస్మికముగ నాకట్ల నచ్చట విడిచి బంగారము జేబున నుండఁ బరారియయ్యెదను మీరు నన్ను కొంతవఱకుఁ దరిమి తిరిగి వానినే పట్టుకొని వాసిపెరు నూరు నోటీ చేసికొని విడిచిపెట్టవలెను.

ఈవిధముగా జరిగిన దొంగను దేలు కుట్టినవిధముగాఁ బెఱవారి కెవ్వరికినిఁ జెప్పక మాట్లాడక యూఱకుండును. అంతయే కాక మనము చేసినది మాయ యనియు నతనికిఁ దెలియదు.

అందఱు—హియర్! హియర్! వెరీగ్రేండు స్కీమింగుహెడ్డ్!

(చప్పట్లు చఱతురు)

శ్యాము—నడువుఁ డప్పుడే పన్నెండుగంటలు కా వచ్చినది.

(నిష్క్రమింతురు.)

అప్ప—(తూలుచుఁ బ్రవేశించి) ఈ ల్లైవల్లి పిల్లాల్ని దీసుకొచ్చినా యెనల్లకొంపలు మూపేసినా నాకేఁవీ బయ్యం నేదు కాని, కొంపఁ దీసి నాయుప్పినిగాని దీసుకొత్తే నేను బతకలేనురా రంగా! అంత ఘోరపాటుపని జరగదు కాని దేవుతనాటి నాయాఁడదాన్ని జూత్తే యీాళ్లబుట్ట దిరుగుడ్దేపూ యని నా ననుమానం పడుతుండాను. అన్నొక్కరమ్మకి న్నా చెత్తికలది.

సీ॥ గళ్లకోకను మంచి ♦ గత్తుగా బిగఁ గట్టి
యొంతో గొంతును గంగి ♦ రెన్నునాఁగ
ముక్కుపై నావుక ♦ ముక్కల నెట్టుకోని యెం
చెక్క నుంకును రాఁవ ♦ సిలకనాఁగ
బుట్ట చంకను బెట్టి, చుట్ట నోటను బెట్టి
అడుగు లేసును గదా అంసనాఁగ
మంచికూర రొంగుక ♦ కంచిఁ ముకూఁదును
రెట్టించి తిని దిబ్బ ♦ గొట్టినాఁగ

తే॥ గీ॥ బలిసి మదఁవెక్కి కైపెక్కి ♦ పందినాఁగ
యిట్టె నలుగురు పిల్లల ♦ గట్టివోళ్ల
కన్నెనాయాలి నీళ్లు నా ♦ కళ్లు మూసి
మనువుగట్టుకుఁటా రేము ♦ మాయఁ జేసి.

ఊఁ. ఊఁఅంత పనొత్తే యెటిమాన్లయితే అయ్యేరు కాని నానసలు రౌడీముండాకొడుకుని. గుండెలిమీఁద గాలేసి నెరివెయ్యినా నాను పోటు పొడిత్తే డాగుదోలు పరీచ్చ చెయ్యినేఁడేయ్!

(వడిగా నిష్క్రమించును.)

(తెఱ పడును.)



# తృతీయాంకము—ద్వితీయరంగము.

(పురబహిర్భాగమున శ్యామలరావు ముందును వెనుక రమణయ్యశెట్టియును బ్రవేశింతురు)

రమ—ఏమండో! మనప్రయాణాని కెక్కడా తెంపు లేదేంటి? గుడ్ల మీఁద కొత్తున్నాయి నడలేక.

శ్యామ—నేను మొదటనే చెప్పితిని కదా! బండి కట్టించుకొందమని.

రమ—నేనుమాత్రం జెప్ప లేదటయ్యా! బండెక్కితే తల తిప్పుద్దని.

శ్యామ—అట్లయిన నడువుము నోరు మూసికొని.

రమ—మాట లాడొద్దంటావేం? యిక్కడున్నట్టు చెప్పి మూఁడు మయిళ్ళుదూరం తీసికొచ్చి—చీఁకటికూడా బడొచ్చింది.

శ్యామ—(వినయముగా) నడవండిసార్! కోపగించుకొనకండి! మన మిప్పుడు చేయుచున్న దతిరహస్యప్రయాణము. మనము వచ్చుటప్పుడు సి. ఐ. డీస్. చూచారేమో యని నాకు కొంచె మనుమానముగా నున్నది. మిమ్ముఁ జూచిన గొఱ్ఱెనుకఁ గోసినమేఁకవలె నొకటేయాలుపు. పోని యీవేళ కింటి కేఁగుదమా? మరల రేపు రావచ్చును.

రమ—(తనలో) నే నీడిమాట కెదిరించే నని కాఁబోసు యిల్లాటి తిరుగుమాటఁ జెప్పుతున్నాఁడు. బుద్ధితక్కువ యుండే అబద్ధా లాడ్తా

నికి బూతులు తినడానికి బయిఁపడివోఁడు అసలైనకోవ్రఁటి కానే కాఁడు. రెట్టికి రెట్టు లాబం వచ్చేటప్పుడు తిట్టులే కాదు దెబ్బలు కూడా తిన్నా తప్పన్నా గాడిదుండఁడు. (ప్రకాశముగా) ఏమండో! అయ్యా! మల్లీ మల్లీ బెట్టక యేదో యిప్పుడే తేల్చెయ్యండి బాబు!

శ్యాము—తేల్చుట కేమి కాని రాజభయము నన్ను ముందున కేఁగ నిచ్చుట లేదు.

రమ—ఓహో! ముందెంతో ధైర్యశాలిలాగ పోలీసోరు నన్ను జూడఁగానే జడుత్తారన్నావు కాదటయ్యా! ఇలాగ బయంపడతావేం?

శ్యాము—(తనలో) ఆహా! ఒంటిగాఁ బట్టపగలే రాచబాటను బోవ భీతి పశునీవైశ్యం డాశాపాశములచేఁ గట్టుబడి ధైర్యరథంబు నెంతవడివడిగా లాగుచున్నాఁడు! నాకును వినికన్న నెక్కుడు తొందరగానే యున్నది కాని మా వాళ్ళెక్కిబ్బులోనో గొంతుకల వరకుఁ దాఁగి యీమాటయే నుడువ సిద్ధమున్నది.

రమ—ఏమండో! అయ్యా! మీరాలోచన మాంతెందా యేంటి? ఇదిగో నింకొక కాసెక్కువే యేసుకొచ్చేను. మరి మాటమీద నాకొక్కకాసు జేబులో నెక్కించుకోండి సడవండి (జేబు నుండి కాసులు తీయునట్లు నటించుచుండును)

శి, భా, దు,—(లోపలనుండి సైగ చేయుదురు)

శ్యాము—(మరల వారిని సిద్ధముగ నుండు మని సైగ చేయును) రైట్! అట్లయిన నడువుము త్వరగా!

రమ—సంపేవయ్యా! యీ మాత్రిందానికి? బంగారము లేఁదే బయలుదేరే ననుకున్నావా యేంటి? (నడుచు చుందురు)

శ్యాము—(రహస్యముగా) ఇదిగో! ఇదియే మనరహస్యస్థానము. (అని అటు నిటుఁ జూచి పాతి యుంచినకట్లనుఁ బైకిఁ దీసి చూపు

చుండును. అంతనొకవైపు నుండి మార్తాండమూర్తి హైమవతి సంతోషముగాఁ బ్రవేశింతురు)

మార్తాం—ఆహా! ప్రకృతిచిత్రము కనుల కెంతయానందము నిచ్చు చున్నది! అందును సాయంకాలసంధ్యాసమయము.

ఉ॥ వేలకువేలురూపములు ♦ వేరుగ మేఘము లూనుచున్ గడున్
మేలగుసూర్యకాంతి పడ ♦ మిన్నునఁ బశ్చిమమంతయున్ భళీ!
మేలిమివన్నె నందెడిని ♦ మించుసువర్ణరసప్రయుక్తమే
పాలనచేసి కంది రవి ♦ పండఁగ నేఁగెను చూడుమా సతీ!

హైమ—నాథా! ప్రేమానురాగసంభూతు లగుదంపతులకు స్వేచ్ఛా విహార మెంతయానందదాయకము!

రమ—(మార్తాండహైమవతులఁ జూచి) ఉండం డుండండి మనెవ్వా రం సెరపడానికి కాఁవోసు ఆళ్ళుబ్బ సచ్చినట్టు మనతోవే పట్టే రాళ్ళైవళ్ళో

శ్యామ—(కట్లను దాఁచుచు) సి. ఐ. డీలు కారు కదా!

రమ—కారయ్యా! కారు. కనపడ్డంలేదూ? జోడీ.

శ్యామ—(తనలో) వీని కీధైర్య మెట నుండి వచ్చెనో తెలియకున్నది.

హైమ—నాథా! అందలిచిత్రముల నరయుఁడు

చం॥ అలరెడువృక్షవర్గముల ♦ యందును బాడెడికీరవర్గమున్
బలముగ నీటియొడ్డునను ♦ వాలుగ నుండెడిచిన్నమొక్కలున్
జలనము లేనికొండలును ♦ చంచలకుంజము తాళ్లు దిబ్బలున్
గలిగియు సంతసంబుఁ గడుఁ ♦ గల్గఁగఁ జేయును జూడఁగన్ మదిన్

మార్తాం—ఈవేళ విహారము నింతతో విరమించి ఇంటి కేఁగుదము. ఈనిర్జనప్రదేశమున నిఁక నిలువ రాదు.

హైమ—ఆర్యా! నేఁ గోరినవన్నియుఁ జూపించితిరి కాని సమీపము మున నున్ననదీమతల్లిని గూడ దర్శించి పోవ నాకు నుత్సాహము

కల్లు చున్నది. ఆకోర్కెం గూడం దీర్చరే ?

మార్తాం—ఇంకను నిదియొకటి మిగిలినదా ! నకువు మట్లయిన.
(నిష్క్రమింతురు)

రమ—ఒదిలేట్టా నాయినా !

శ్యామ—తీయ వచ్చునా కట్లను ?

రమ—ఇంకబ్బెంతర మేంటి తియ్యండి జాగ్రత్తగా.

శ్యామ—(నాలుగుకట్లలు పాతియుంచిన స్థలమునుండి పైకిఁ దీసి) ఇవిగో! యీనాలుగుకట్టలు నాలుగువే లుంచును. ఒకటి రెండు కాగితము లెక్కువే యుండ వచ్చును గాని తక్కువ యుండవు.

రమ—(సంతోషముగాఁ దనలో) అబ్బో! అబ్బో! యేంబాగ్గం! యేం బాగ్గం! కట్టలు సూడఁ గానే వొల్లు వులకరిస్తా వుంది—కాని యీఁడి నమ్మక మెవడికి? యేకాయితాని కా కాయితం లెక్కసూసుకుంటే మంచిది. (ప్రకాశముగా) ఏవండో! అయ్యా ! మీమాటలన్నీ అచ్చరాలే కాని యెవ్వారింపట్ల మొకవాటాలు పనికి రావు. కాఁబట్టి కట్లిప్పండి లెక్క సూద్దాం. ఊఁ —

శ్యామ—అట్లయినఁ దేలినదన్నమాట యే? మీకంత యనమానముగా నున్నఁ గట్లను మీయొద్దనే పెట్టుకొని కాసులు పైకి తీయండి.

రమ—ఇప్పు డనుమానఁ వన్నాగాడి చెవఁడు? కాసులు పైనే వున్నాయి; యిప్పండి కట్టలను: చీఁకటికూడా పడింది అలాగ బయపడ తారే? అయ్యో !

శ్యామ—(విసుగుఁదలతో) ఆలస్యా దమృతమ్ విష మ్మన్నారు. ఇంత యనమానముఁ గలమానవునితో వ్యవహారము చేయుట నాయదియే తప్పు ! ఏమయ్యా ! నానమ్మకము నీకు లేనప్పుడు నీనమ్మకము నాకుమాత్రి మేమిటి? ఒక్కటియేమాట; ముందు కాసులు నాకర్పించినఁ గాని కాగితములు నీచేతి కివ్వను; అట్లిష్ట మైనచో

నాతో మాట్లాడకుము· లేదా నీత్రోవన నీవు నడువుము· మాకు ధన మనినిఁ జే దనినట్లు మాట్లాడుదు వేమయ్యా! (లేవఁబోవును)

రమ—లెక్క లెక్క. లెగిత్తే వొట్టు. యెవ్వారంకాడ దుడుకు సాఁగదయ్యా! అయ్యో! యెక్కడో యెట్లోఁకలా గున్నావే నే నోపక్క జెబుతా విను.

శ్యామ—పక్క గిక్క నో. నో.

రమ—అయ్యా! మీవి మీరు నాది నేను పైటఁ బెట్టి కాగితాలు లెక్క చూసుకొన్నాక కాసులు కూడా లెక్కపెట్టుకో వచ్చును దివ్యంగాను. ఏయి యిల్లా గివ్వండి.

శ్యామ—ఓహో! నీకోమటియెత్తు నామీఁదఁ బ్రయోగింపకుము. నాకిట్ట లివిగోఁ పైనే యున్నవి. నీకాసులే కనఁబడుట లేదు. దొరుకక దొరుకక నీవే దాఁపురి మైత్రి వేయుచున్నా! నేను పోరు గూరివాఁడను కొంపఁ దీసి యీనోట్లన్నియు నావే యనిన నా కెక్కడ దిక్కున్నది? కావునఁ గాసులు నాజేబున నెక్కువరకు కట్లకట్లే విప్ప నీయను.

రమ—(తనలో) నేనే అనకుంటే యీయఁన నాకంటె పిరికెవన రొక్కం పులాభ మొచ్చేటప్పాడు నాలుక్కాయితా లెచ్చుగ్గుకేఁవి గాని కాసులు ముందీడి సేతులోఁ బడితే నోట్లట్టుకుని కాలికి బుద్ది సెప్పఁడుగదా! అలాటోఁడు కాఁడు కాని అంతపని జరిగితే గట్టిగా నోటితోటరిసి సంపెయ్యన?

శ్యామ—(లేచి) బాబూ! నీతో నాకుఁ గుదురదు. నాతోవన నేను పోవుదును. నీవుఁ గూడ రోడ్డు పట్టు.

రమ—కూర్చో! కూర్చో! నా తెంపు నీకుఁ దెలుసు. నీపంతమే నెగ్గింది లే కట్లక్కడఁ బెట్టు.

రమ—(కట్టలు తొడలపైఁ బెట్టుకొని కాసులు లెక్కపెట్టి యిచ్చును.)

శ్యామ—(జేబున కెక్కించుకొని) ఇప్పుడు లెక్కపెట్టుకొనుము. నీ యిచ్చవచ్చినట్లు.

రమ—(సంతోషముగాఁ దనలో) నిజంగా రావుదళ నానడినెత్తి నుంది. ఇందుకునే కాంగ్రెసు యీమధ్య నీయెడమకన్నేకదరడఁవే. అయ్యో! యేం టీయమాగళం కళ్ళుమూసుకుని ఒక్కసారిగా కలిమి నామీఁదపడిందని కాంగ్రెసు కుడికన్ను నఁబోయి యెదవనోరు యెడమకన్ను నేసింది (కట్టలు విప్పుచుండును)

శ్యామ—(లోనున్న రాస్కెల్సునకు సైగ చేయును)

రాస్కెల్సు—(తెరలో) అదుగో రాజద్రోహి పట్టుఁడు పట్టుఁడు.

శ్యామ—(అదరిపడి) అమ్మయ్యో! యేది దిక్కు?

రమ—(భయమున) ఓరయ్యో యెవ్వారాని కెంతచేటొచ్చిందిరో! నాకొంప గున్న ముయ్యాలాగుందే?

శ్యామ—ఓరఫూల్! అట్లు గోల సేయక నామాట కొంచెము వినుము. మన మిప్పుడే మాత్రము జాగు చేసినను ఈధనమంతయు గవర్నమెంటువారి కొప్పఁ జెప్పుటయే కాక కఠినశిక్షలకుఁ బాత్రులముకూడఁ గాఁగలము, కాన నే నిదే పోవుచుంటిని. నీ వీకట్టలను ప్రస్తుతి మాపాదలమఱుఁగునఁ బదిలపరపుము ఊఁ. ఆలసించినఁ బ్రమాదము (పారిపోవును.)

రమ—చచ్చేనురా! దేవుఁడా! పరుగెత్తడానికైనా పనికిరాని స్థూల శరీరం నాది. ఇప్పుడేం చెయ్యను? కాసులతో వాఁడు గసి మిసయ్యేఁడు. ఈగండం తప్పించుకోటానికి యిప్పుడు కట్టలా పొదల్లో పారెయ్యడమే మంచిది. (అట్లు చేయును.)

రాస్కెల్సు—(పోలీసు వేషములతోఁ బ్రవేశించి) ఏఁడీ యీరాజద్రోహి! ఏఁడీ యీదేశద్రోహి! ఇపుడిందుండెనే యింతలో నేమైనాఁడు.

రమ—(తనలో) నన్నట్టుకునీలాగున్నారే! బొంకేత్తాను. (పైకి) అమ్మతోడు - అబ్బతోడు - నాకు తెల్లు బాబూ నాకు తెల్దు.

శివ—తెలియదురా! డేమిట్! వాఁడూ నీవు ఇంతవఱకు నిటఁ గూర్చున్న కారణ మేమి?

రమ—ఏగాడి దన్నాఁడు? ఆఁడూ నేనూ కూర్చున్నాఁ వని. పొలఁ వెల్లి పోద్దోయి వస్తున్నాను ఆఁడెవఁడు నాకు?

భాస్క—అబ్బా! యెంతగొప్ప కొట్టుచున్నావు (పుస్తకముఁ దీసి) నీ యూరు, పేరు, కులము, వృత్తి చెప్పుము. ఊఁ—

రమ—(తనలో) కడుపులోనీల్లు కదలకుండా యింటిలో కూకోక దురాసపడ్డంచేత కక్కాకీ ముక్కకీ చెడ్డ కుక్కలా గయ్యింది నా బతు కిప్పుడు.

భాస్క—ఊఁ. . చెప్పుము (వీపుపైఁ బఱచును)

రమ—(పెద్దపెట్టుగా) ఓరయ్యో! చచ్చేను. అమ్మో! నిమొక బింక సూడను కావోసు కొంపా గోడీ యిడిచిపెట్టి నేనిక్కడ కడుపు బద్దలయ్యి చత్తున్నానేం.

[అంత మార్తాండమూర్తియు, హైమవతియుఁ, బ్రవేశింతురు]

మార్తాం—ఏమ్యోశ నారోదనము? పురుషుని కంఠధ్వనివలె నున్నదే!

హైమ—నాథా! ఆచిఱుచీఁకటులనడుమఁ గాన్పించువ్యక్తులయొద్దనే యై యుండవచ్చును

రమ—మీపాదా లట్టుకుంటా నన్నొదిలెయ్యండి బాబు! నిరపరాధిని.

శివ—నీవిక్కడఁ జెప్పవాఁడవు కావు. నడువుము స్టేషనుకు (గెంటును)

రమ—ఓరి దేవుఁడా! రావేమిరా! నన్ను రక్షించడానికి

హైమ—ఎవ్వరినో పాపము దొంగలు కాఁబోలు బాధింపుచున్నారు. నాథా! మన మీప్రదేశమున నుండఁ దగదు.

మార్తాం—బేలా! భీతిఁ జెందకుము. (ఎగ్గెత్తి) ఆపత్సమయంబున సహా యంబుఁ గోరు నోవ్య స్త్రీ భయ మూడుఁగుమా. ఇదేవచ్చుచుంటిని.

రమ—ఎవరది? మీయమ్మకడుపు చల్లఁగా మామంచిమాటవినిపించేరు.

శ్యామ—ఓహో! చాలశ్రెమ్మిగాను ౘంపరుగాను వచ్చితివే. నీకుఁ గూడ నీవ్యవహారములో నేమైన సంబంధమున్నదా యేమి?

మార్తాం—ఏవ్యవహార మది?

శ్యామ—దొంగతనము.

మార్తాం—ఈతఁ డేమైన దొంగిలించెనా?

శ్యామ—అన్నమాటయే! ఈతఁడు చేయుచున్నను ఆరకముబేచ్ తోఁ గొంత సంబంధము కలదు.

రమ—బాబూ! అబద్ధం. అదంతా పచ్చి అబద్ధం. దైవసాక్షిగా నే నల్లాటోన్ని కాను (అనుచు మార్తాండుని జేరఁ బోవును.)

శివ—మాటలసందడిలో నీవు వానిమఱుఁగున కేఁగు చుంటి వేల? రమ్మిటు (లాగును)

మార్తాం—(యోచింపుచు) నేను వీరిమాటలెచ్చుటకో తలఁచుగా విని నయట్లు తోఁచుచున్నది. పోలీసోద్యోగియులలో నా కెవ్వరును బరిచయులు లేరే! (వారిటోపీలనుజూచి) ఆశ్చర్యము! ఇది యంతయు నేదో కృత్రిమమువలె నున్నదే! ఏమైనఁ గానిమ్ము. సరియైన యాయుధము నాయొద్ద నున్నదికదా! ఓకృత్రిమవ్యక్తు లారా! మీప్రవర్తన మంతయుఁ జాలఁ గ్రూరముగాఁ దోఁచు చున్నది. మీరు నిజమైన గవర్నమెంటు ఉద్యోగియులా! అట్లయిన మీతలల నున్నటోపీలపై సింబల్సు ఏవి? నే నడిగిన ప్రశ్నలకన్నింటికి సరియైనయుత్తరము లిచ్చి యటుపైన వీనిని మీయిష్టము వచ్చినట్లు చేసికొనుఁడు. అంతవఱకు వానిపై నీఁగవాలనైన వ్రాల వీలులేదు.

రమ—(తనలో) తిరిగింది నారావు తిరిగింది.

భాస్క—ఓరిస్టూల్! నీ విచ్చట నట్టి యధికప్రసంగము చేయక నీ త్రోవను నీవు పొమ్ము. (గెంటును)

మార్తాం—ఆహా! యేమి సాహసము! నిశ్చయమే. మీరు పోలీసో ద్యోగీయులు కారు. మోసగాండ్రు. ఇట్లు ప్రజల నెందఱ నె న్నెన్ని మోసములు చేయుచుండిరిరా!

శ్యామ—మేము నిజముగ పోలీసులము కామనుకొనుము. కాకున్న నీవు చేయున దేమిరా! మే మెవ్వరమో చెప్పుమందువా? ఈ సిటీయందలి రణరౌడీలమురా! డేమెట్. ఈసరికైన వేగమే సగౌరవముగ గృహోన్ముఖుడవు కమ్ము.

మార్తాం—కాకున్న?

శ్యామ—కదనమునకు రమ్ము

మార్తాం—(కోపమున) ఓరోరి నీచాతినీచులారా! భ్రష్టులారా!

శా. క్రూరవ్యక్తుల నింతవింతపనులన్ క్రూరంబుగాఁ జేయుచున్
వీరాలాపము లాడ నేల నిఁక మీ వీరత్వముల్ చూపఁగన్
బోరన్ రండిటు పౌరుష బు కలదా! పొంకంబుగాఁ బోరుచున్
మీరౌడీత్వము నే నడంచెదను నామేనింతయున్ స్రుక్కకే.

మీరు రౌడీలను మింమరణరౌడీ లయిన సుగుణశీలగర్భపయఃపారావారరాకాసుధాకరుం డగుసీమార్తాండరామమూర్తి రౌడీలనెల్లరను జంచి చెండాడు రణసీటిపిశారదుం డని యెఱుంగుడు. (రివాల్వరు వారెల్లరకు గుఱిచేసి) ఇఁక నోరెత్తిన గుండెలు చీల్చఁ గలను రాస్కెల్సు!

హైమ—నాథా! తొందఱఁ జెందకుఁడు (వారించును)

రమ—(భయమునఁ దనలో) అమ్మో! ఓరబ్బో! వీఁడాళ్లను చంపుతాఁడు కాఁబోసుఁ? పీడొదిలి పిశాచి పట్టుకునీ లాగుందే! ఇదెవరంతికాలాని కొచ్చిందో! కష్టాలకటుకుకాని సుకాలపుట్ట

కాదురో! ఇంతమందిని చంపడానికి చెయ్యెత్తినకటికోడు నన్నుమాత్రం యిడిచిపెడతాడా! యీళ్ళికంగాళ్ళో వుండగా నాతోవ నేను మానుకుంటే ప్రాణాలయినా దక్కుతాయి. దురాశ నాకుఃఖాని కొచ్చిందిరా దేవుఁడా! (పోవును.)

మార్తాం—మూర్ఖులారా! ఇప్పటికైన మీగర్వప్రాయశ్చిత్తమైనదా? సిడ్డవున్

రాస్కేలు—(కూర్చుందురు.)

మార్తాం—స్టేండప్

రాస్కేలు—(లేతురు)

మార్తాం—(నవ్వుచు) నే నడిగినప్రశ్నలకన్నింటికి ఇప్పుడైన సరియైన యుత్తరము లిచ్చెదరా?

హైమ—(వెనుకకుఁ జూచి తొందరగా) ఆర్యా! మనము సహాయము చేయుచున్నమనుజుఁడు కాలికొలఁదిఁ బాఱిపోవుచున్నాఁడు.

మార్తాం—(ఆశ్చర్యమున జూచుచు) ఆ ఏఁడీ! యెటు పోవుచున్నాఁడు?

హైమ—అదుగో! ఆచీఁకటిలో మాయమైనాఁడు

మార్తాం—ఆశ్చర్యముగ నున్నదే!

రాస్కేలు—(సంగ్రహించుకొని, అందొకఁడు చేతిలో నున్నలాటీతో మార్తాండమూర్తి శిరముపై గట్టిగాఁగొట్టి పాఱిపోవుదురు)

మార్తాం—హా... హైమా.. (శిరము కరములతోఁ బట్టుకొని ధరణి కొరుఁగును)

హైమ—అయ్యయ్యో! ఏమి యీఘోరము నాథా! నాథా! పలుక రేమి? ఓభగవంతుఁడా! ఇంతలో మాకెంతవంత చేకుర్చితివి? నానాథునకు స్మృతిలేదు. ఓక్కటా! ఇక్కడ నాకు దిక్కేది? ఆక్రూరకర్ము లింకను మమ్మేమిచేయ సమకట్టుచుండిరో! అమ్మయ్యో! జగమంతయు నంధకారబంధుర మగుచున్నదే!

ఓపరమేశ్వరా! దిక్కులేక మే మిక్కడ స్రుక్కవలసినదే! సమీపమున నెక్కడను జలమైన లేదు. ఓ ఆపద్బాంధవా! దీన రక్షకా! నీవేదిక్కు (విలపించుచు శైత్యోపచారములు చేయు చుండును.)

శివ—(బేటరీలైటు చేనుండఁ బ్రవేశించి) చిరకాలమునుండియు నెన్ని ప్రయత్నములచేతనైన నితనిచే మద్యపానము చేయింపనెంచి విఫలమనోరథుండ నైతిని. అట్టి దగుమహాతరుణ మిట్టే నాస్నేహితులమూలమున నేఁటికి సాధ్యమయ్యెను. ఇటుపై నితని గీలుబొమ్మను జేసి యాడింపకుందునే. (బిగ్గరగా) ఎవ రాచీఁకటిని బడి విచారించువారు ?

హైమ—మహాత్మా! నానాథు నేదుర్మార్గులో హింసించిరి. దిక్కు తెలియక నే నిక్కడ స్రుక్కుచుంటి. దయార్ద్రహృదయులై సహాయ మొనరింపరే!

శివ—అమ్మా! భయ మందుగుము. (లైటువేసి) అకటకటా! నా మిత్రుఁ డగుమార్తాండమూర్తికే యీకష్టము? కలనైనఁ బగవాని కైన హాని చేయనియ్యకొనని యీపూజ్యునే వేధించిన దుష్టుల వెదకి వెదకి వెంటనే కాలుసేదరిఁ జేర్పకున్న నామనస్తాప మడంగునే.

హైమ—శమరి నిట్లు తారసిల్లఁ జేసినదైవమున కెన్నేనిద డములు. అమ్మా! నానాథునిఁ జూచుచుండుఁడు. ఈయెడ నేడనైనఁ గాసారమున్న వెదకి జలములను గొనితెచ్చెద (పోబోవ)

శివ—(వారించి) అమ్మా! పాదునీ రేటికి! నాయొద్ద జీవామృత మున్నది. దీనియొక్కమహిమ శీఘ్రకాలములోనే తెలిసికొనఁగలవు. ఒక్కబిందు వీతనినోటఁ బడినంతనే నితని స్వస్థచిత్తునిఁ జేసి యారోగ్యము నిచ్చును. (బ్రాంది మార్తాండునినోటఁ బోయును)

మార్తాం—(కదలుచు) అబ్బా....ఈపార్శ్వ మంతయు గునపపు పోటు... హ్హా. (నిట్టూర్పుపుచ్చును.)

హైమ—మీదయవలన నానాథునకుఁ దెలివి కలిగినది.

శివ—అంతమాత్రమే కాదు. ఇంతలో నామిత్రుని నడిపించెదను చూడుము. (మరలఁ ద్రాగించును.)

హై—నాథా! ఎట్లున్నది?

మార్తాం—హ్హా—(నిట్టూర్పునిగిడ్చి) గుండెలుమాత్రము కొంచెము మండుచున్నవి కాని బాధ చాలవఱకుఁ బాసినది

హైమ—అది యీమహత్కృపాకటాక్షమున—

శివ—(తనలో) నే ననుకొనినయాతపనియు నిరాటంకముగ నెరవేరినది.

మార్తాం—పరమకృపాకరుఁడ వౌనో ప్రాణదాతా! వందనములు.

శివ—మిత్రుఁడ అన్యుఁడను గాను నెమ్మి చాలకైమైనది మీవారె దారుపూఁముచుందును.

మార్తాం—ఆహా! మైబోజమ్ఫ్రెండు శివరావే! యేమి నాభాగ్యము. (ఆలింగనము చేసికొని) కాని మిత్రుఁడా! నిరపరాధి నగునన్ను నిష్కారణముగఁ గష్టపెట్టినట్టిదిట్టవుల మట్టుఁబెట్టక యెట్టులు నే నింటికిఁ జనుదును! ఆదురాత్ములరుధిరము నాయాననమునఁ దిలకముగా నిడుదాఁక నేను నాయిల్లు చొచ్చుట కల్ల. కల్ల.

శివ—ఆహా! వెనుకఁబోయినతీఁగ కాళ్లకే చుట్టుకొనినదే! ఈతఁడు స్వగృహమునకే చేరినచో బ్రాంది దినదినము త్రాగించుట యెట్లని యోచింపుచుండ దానియొక్కనివృత్తి నీతఁడే చేసినాఁడు. ఒక్కటెన్ డేస్ టైములో నితని సకలవిద్యాపారంగతునిఁ జేయవచ్చును.

మార్తాం—బ్రదర్! యేమట్లాలోచింపుచుంటివి?

శివ—అబ్బే! ఆదుర్మాతు లెట్లు మనకు సాధ్యమగుదురా యని.

మార్తాం—ఏమీ! సాధ్యమే కారా! యెట్లు కాదో చూచెదఁ గాక.

శివ—(తనలో) ఆహాహా! యెంతశాంతమూర్తి యింతలో రక్తనేత్రుఁ డయ్యెను. దీనికంతకు శూరగుణదమగుబ్రాందియే కారణము. ఈతఁ డాచరించినప్రతిజ్ఞకు సరియైన యాధారము మాయొద్ద సిద్ధము గానే యున్నది. మఱియు ప్రతివిషయమునందును నేను దొంగని మాగుట్టంతయు గ్రహించియున్న మావిరోధియే నిన్ను బాధించె నని దీని కనుకూల మగుతార్కాణములు తారసిల్లఁ జేసి తొలుఁదొలత నాతని మారణముఁ జేయించి యితనికి శాంతి నిచ్చి మాపీడ వదలఁ గొట్టుకొనవలయును (ప్ర) మిత్రమా! ప్రస్తుతము శాంతింపుము అనన్యసామాన్యశేముషీధురంధరులగు మాబోటి నెచ్చెలులుగల నీ కేటికీచింత. అట్లే చేయవచ్చును నడువుఁడు (నడుచుచుందురు.)

మార్తాం—బ్రదర్! నీమందుయొక్క మహిమ యేమోకాని యది నా బాధనంతయుఁ బాపుటయే కాక యెంత హాయిగా నున్నది!

శివ—మరలఁ గొంచెము సేవించినచో మరింత గ్రాండుగా నుండును. కానిమ్ము (త్రాగింపుచు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

---



# ఘోర్ రాస్కేల్స్.

అను,

## పతిసేవ నాటకము.

చతుర్థాంకము :—ప్రథమరంగము.

స్థలము: గృహాంతరము.

[ప్రవేశము । హైమవతి, మార్తాండమూర్తిపటము గద్దెపైఁ బెట్టి సోఫాపైఁ గూర్చుండి విచారముతో.]

హైమ—అక్కటా ! నావిభునినడత పూర్తిగాఁ జెడినది.

సీ. పనిలేక నిముస ముం। డను నెంచు నను వాఁడు
నాఋనెల. ఁపంపి । వేరుపడఁడు
అమృతము నెపుడును । నాడ నొల్లనివాఁడు
చూడఁ బో మాతోడ । లేఁడను మనుఁ
దల్లిదండ్రులమాటఁ । దలను దాల్చెడువాఁడు
కన్ను మూచును వారిఁ । గష్టపెట్టఁ
గడియ యైనను నన్ను । విడిచి యుండనివాఁడు
కల నైన నాతోడఁ । గలయ రాఁడు

తే. గీ. అట్టియనుపమసుజ్ఞాని । యిట్టు లౌన
టంచు నెంచ నైతి నకట । కొంచె మైన

నెట్టిదో నానుదిటిఁవ్రాత యెఱుఁగ వశమ
దేవదేవ యన్నిటికీవె దిక్కుసుమ్ము.

ఎంతకుంది యేమిప్రయోజనము. ఆపుణ్యమూర్తి కరుణాకటాక్షవీక్షణ ములను మామీఁద వెదఁజల్ల వలయును గదా! (పటముజూచి) ఆహా! కేవలము మార్తాండస్వరూపముచు మించఁ గలుగు నోదివ్యమంగళవిగ్రహమా! మీచేత నున్నమాప్రాణము లిట్లు నలుమ న్యాయమా! (పూవులు జల్లుచుఁ బాడుచుఁ దన్మయురాలై యుండును.)

మార్తాం—[ప్రవేశించి] ఆడినమాటను దప్పక నిర్విఘ్నముగ నెఱవేర్చినవాఁడే పురుషసింహుఁ డన నొప్పు ఏపాప మెఱుఁగని నన్నన్యాయముగ హింసించినక్రూరు నేమి చేసినను దోసము లేదు. ఒకానొకప్పుడు వానిపైఁ జాలిజనించి యూరకున్నప్పటికి మిత్రప్రోత్సాహవశముచే వానిఁ జంపి ప్రతిజ్ఞాభంగము కలుగకుండఁ జేసికొంటిని కదా! (భార్యనుచూచి) ఓహో! నాసతి యమిత నిశ్చల దృష్టితో నేప్రతిమనో పూజ చేయుచున్నదే. (సమీపించును.)

హైమ—(దిగ్గున లేచి) పటము వక్షమున నానుకొని) ఏమి నాభాగ్యము! నాదేవుఁ డెంతలోఁ బ్రత్యక్షమైనాఁడు. (అని తనలో ముఱియుచు) నాథా! నమస్కారములు. తమరు దయచేసి చాల సేపు కాలేదు కదా! తమపదధ్యానమున మైమఱచినదాన నగుటచే తమరాక వెంటనే తెలిసికొనఁ జాలనైతిని. ఈదాసి తప్పును క్షమింపవేఁడుచున్నాను (కాళ్లపైఁ బడును.)

మార్తాం—(తనలో) అతివినయం ధూర్తలక్షణ మనినట్లు యెంతవినయమగుపఱచుచున్నది. (పైకి) నేను వచ్చి యొక్కక్షణమైనఁ గాలేదు లెమ్ము.

హైమ—చిత్తము. (లేచి) మీతల్లిదండ్రులకన్నులఁ జల్లఁజేసియే వచ్చితిరా ?

మార్తాం—ఇఁకను వారి కగుపడ లేను. నీచేత నదేమి?

హైమ—ఇది నాయిష్టదైవప్రతిమ.

మార్తాం—అట్లయిన నే నది చూడఁ గూడదా యేమి?

హైమ—తమ్మఁ దామే చూచుకొనుట కింకొక తెయాటంకమా! ఇదిగో వీక్షింపుఁడు మీప్రతిమయే.

మార్తాం—(తనలో) ఈవిధమైనపూజాపురస్కారములే కాని దీనిముఖమున సరియైన లవ్ పోశ్చరే కాన్పించదు.

హైమ—నాథా! సమస్తగుణసంపన్నులగుతమరు ఊరు పేరు లేనియే దుర్మార్గులనో యోడించుట కెంతయో కఠినప్రతిజ్ఞఁ గావించి యిల్లు విడిచి మాకందఱకు దూరమై మమ్మేడ్పించుట మీకు న్యాయమా!

మార్తాం—కుడిచి కూర్చుండక మి మ్మేమువు మన్నవాఁ డెవఁడు? ఈపూట నాకుఁ గొంచెము అర్జంటుపని యున్నది. మీగోలమూలమున నాపనిఁ జక్కబెట్టకయే రావలసి వచ్చినది. కావున మేడమీఁది కేఁగి వారికిఁ గూడఁ గనుపించి మఱలెదను.

హైమ—ఈ యాఱుమాసములనుండియు మీపనులు పూర్తియే కాలేదా ?

మార్తాం—అధికప్రసంగ మాచరింపకుము. (పోవును) అదిగో! శాస్త్రిగారితోసైత మందఱు నిటే వచ్చుచున్నారు.

[అంత సుగుణశీల సుగుణవతులును జంద్రమౌళిశాస్త్రియు ప్రవేశింతురు.]

సుగు—(సంతోషముగా) ఓహో! వచ్చితివా! తండ్రీ! (ఆలింగనము చేసికొని) నీవట్లొంటిగా మ మ్మందఱ విడిచియుండ నీమన సెటు

లొప్పె. ఏమి నాన్నా! ఇదివఱకువలెఁ గాక నీమోము కళా విహీనమై యున్నదేమి?

మార్తాం—(విసుగుఁదలతో) దానికి నే నేమి చెప్పఁగలను. మీనేత్రముల కేజబ్బో చేసియుండనోపు.

చంద్ర—అబ్బా! పాకము చాల ముదిరినది.

వతి—బాబూ! మార్తాండా! కన్న తల్లిదండ్రులను గలనయిన విడిచి యుండ నొల్లని నీమానస మేలయింతటికాఠిన్యము వహించినది? ఆఱుమాసములనుండి మ మ్మింత హైన్యముగఁ జూచుట కేమి హేతువు? నేను కాని మీతండ్రిగారు కాని నీభార్య కాని నీ యిచ్చవచ్చినట్లు చరింపక నీమది కెన్నఁడయినఁ గష్టముఁ గల్గించితిమా! నీతోడిదే లోక మనుకొని నీయానందమే మాయానందముగ నెంచి సంతసించు మ మ్మీవిధమునఁ దెగనాడి యుండ నీకుఁ దగునా? నీకలతకుఁ గారణ మెఱుఁగఁబరపక మమ్మేఁ గష్టపెట్టుచుంటివి కదా!

మార్తాం—ఈయాఱుమాసములనుండియు నేను నాస్నేహితులఁ గూడి యనుభవించు నానందమునకు మేర లేదు. నే నానందించుటయే మీ కమితసంతోషదాయకము కదా! అట్టి నాయానందప్రవాహమునకు మీ రేల గట్టు కట్టవలయును?

సుగు—నాన్నా! నీస్నేహితు లెవ్వరు? వారిపేరు లెవ్వి?

మార్తాం—ఆవిమర్శన మీ కేల?

చంద్ర—అతని నేల విమర్శించెదరు? నేఁ జెప్పెదను వినుడు. సకల దుర్వ్యసనదుర్మార్గధురంధరుఁ డగు నాకుమారుఁ డొక డితనికి మొదటిచెలికాఁడు, వానికి జ్యేష్ఠభ్రాతలో యన నొప్పువా రింకను ముగ్వు రున్నారు మీవానికిఁ జెలికాండ్రు.

మార్తాం—పచ్చకామెర్ల వానికి జగమంతయుఁ బచ్చఁగా నున్నట్లు, చెనఁటికిఁ బ్రజలందఱుఁ జెనఁటులట్లే కాన్పింతురు. సుగుణులు కానిమ్ము దుర్గుణులు కానిమ్ము వారిప్రాపే నా కమితానంద దాయకము.

చంద్ర—ఔనౌను. పైత్యరోగికి పంచదార వెగటుగానే యుండును. ఔరా!

తే. గీ. చెడుచెలిమియు దుర్బోధయు ♩ చెడుపనులును
జొచ్చినట్టుల వీనులఁ ♩ జొరవదేమొ
నిత్యశోభనమొసగెడు ♩ నీతిపరుల
పూర్ణసుజ్ఞానతమముగు ♩ బోధలెపుడు.

ఓ వెఱ్ఱివాడా! కుటుంబమునకంతకు నీవొక్కఁడవే యాధారభూతుఁడవుగ నుండియు వీరినందఱఁ ద్యజించి నీవేడనో సుఖించుచు నుంటి వన్న మాట కర్థమేమి?

మార్తాం—అట్లయిన మీయందఱియొక్కయుద్దేశము లేమి?

సుగు—మాయుద్దేశము లేమున్నవి? మాకుఁ గాలము మూడవచ్చుచున్నది కదా! వ్యాపారమంతయు నీమీఁద విడిచిపెట్టి మేమొకయెడ హాయిగఁ గూర్చుండి నీబుద్ధికుశలతచు నీవు సంపాదించెడుకీర్తిని నీకుటుంబవృద్ధిని గాంచి సంతసించుటయే మా మతము.

మార్తాం—(తనలో) ఓహో! ఇది కడుసమంజసముగ నున్నదే! నా ప్రియుఁడు నన్ననవరతము నొక్కి వక్కాణించుచుండెడిపనిని నేఁడే సులభముగఁ బూనునవకాశము చిక్కినదే, భళీ! యేమి నాభాగ్యము!

హేమ—(తనలో) తల్లిదండ్రులయొక్క వాక్సుధారసంబువలనను జంద్రమౌళిశాస్త్రిగారి భాషణామృతమువలనను నానాథునిష్ఠురత మోంతరంగము మాఱినది,

మార్తాం—నాన్నా ! నాబాగు నాకుఁ దెలియదా? కడచినదానికి వగచిన నేమిప్రయోజనము! మీరు నలువురు నాలుగుమాట లాడి నాట్రెయిరు పాడుచేయక యీవినుసము మొదలు బిజినెస్సంతయు నామీఁద విడిచిపెట్టుఁడు. నే నెంతలో నెంతవృద్ధిఁ జేతునో స్వేచ్ఛగ మీ రొకయెడఁ గూర్చుండి వీక్షింపుఁడు.

సుగు—ఓ భగవంతుడా ! యెంతచల్లనిమాటలు వినిపించితివి. ఇదిగో దేవునిపై భారము వైచి యీక్షణమునుండి సమస్తాంగీకారములతో నేసంశయము లేకుండ వ్యాపారమంతయు నీ కర్పింప— (అర్ధోక్తి)

చంద్ర—ఆఁగు డాగుఁడు. అర్పించుచున్నాఁడ ననుమాటమాత్ర మీవేళ విడిచిపెట్టకుఁడు. (వారించుచు)

సుగు—(ఆశ్చర్యముగా) ఏల ?

హైమ—అయ్యో ! యేమి యీఅమంగళము !

పతి—నాన్నగారూ ! అట్లు వారించితి రేమి ?

మార్తాం—ఈయనకు గతిలేక, ఆయనకు మతిలేక, కారణ మేమందురు?

చంద్ర—అమ్మా ! ఈదిన మంత మంచిది కాదు.

మార్తాం—అట్లయిన మంచినాఁ డేదియో నిర్ణయించి కొండ తెముహూర్తముపెట్టి యుంచుఁడు నాఁడే వత్తును (పోవును)

హైమ—అప్పుడే త్రోవఁ దీసినారే !

సుగు—అయ్యో ! ఈదినము చైత్రశుద్ధదశమీబుధవారము కదా ! యేల మంచిది కాదు.

చంద్ర—(పరధ్యానముగానుండి) అయ్యో ! మాకును మాపుత్రునకును నెట్టిసంబంధము లేకుండఁ జేసికొనినవిషయము మీ కెప్పుడైనఁ జెప్పితినా ?

సుగు—మీమనస్సేమైనఁ బాడయినదా యేమి? ఆమాట చాల మార్లు చెప్పినారు.

చంద్ర—దానికేమి కాని సుగుణశీలుఁడుగారూ! ఈమధ్య మనయూర నొకహత్య జరిగినదఁట! దానిగోల మీకేమైనఁ దెలియునా?

సుగు—జరిగినట్లు తెలియును అంతకన్న నరేమియుఁ దెలియదు. విశేషము లేమి?

చంద్ర—ఆశవము నిన్న పదిగంటలకు మనయూరి వెలుపలనున్న యుప్పుటేరునందుఁ దేలినదఁట దానిని సూపరింటెండెంటువారు విమర్శింప నిట్లున్నదఁట! ఈమృతజీవి ఘోరరాజద్రోహి, అంతమాత్రమే కాక రణరౌడీ, రౌడీలనెల్లరను జించి చెండాడు రణనీతివిశారదుఁడు హత్యాకారకుండు కాన నీవిషయమున మీరంతఁగా విమర్శింపఁ బనిలేదు. చిత్తగించవలెను. అని యున్నదఁట

హైమ—(ఉలికిపడును)

సుగు—(గుండెలుకొట్టుకొనుచు) అబ్బా! యెంతరాతిగుండెఁ గలక్రూరుఁడాతఁడు? మీమాటలు వినఁగానే నాయొడలు జల్లుమనినవి.

చంద్ర—దాని కేమైనఁ దగినంత కారణ ముండును కదా!

పతి—భయంకరము లగుమాటలు వినినప్పు డెల్లరకు నట్లే యగును. కారణ మేముండును?

చంద్ర—ఔను అయ్యా! నా కీదినమున గొప్పదియు దురూహ్యమైనదియు నగు భయంకరరహస్య మొకటి చెవిఁ బడినది. అది నిజమగునా కాదా యని చాల సంశయము కలిగి నేను స్వయముగాఁ బోయి విమర్శింపఁగా నచ్చటివగు నాచర్యలఁ బట్టి యా వృత్తాంతమును బలపఱచుకొనుట కే సంశయము నందనైతిని. అంత నే నక్కడఁ గొంతసేపు నిశ్చేష్టుఁడనై యుండ నొకలంత

యుం జెమ్మటలు గ్రమ్మి నామది పరిపరివిధములు పోవ మరే
మియుఁ దోఁచక వచ్చి మీయింటఁ బడితిని.

సుగు—(ఆశ్చర్యముగా) ఆఁ మిమ్ములను వ్యాకులపెట్టునంతటిదైన
చిత్రకార్యమేది? మన కేమైన సంబంధనీయమా?

చంద్ర—రక్తసంబంధమే కాదు. మనప్రాణసమానము

సుగు—(భయాశ్చర్యములతో) అట్టిదెద్ది.

చంద్ర—ఇప్పుడు ప్రశ్నించిన నేఁ జెప్ప లేను. పరిశీలించిన బయటఁ
బడును కదా!

సుగు—అట్లయిన నచ్చోటి కప్పుడే వెళ్ళి వీక్షించి వత్తము నడువుఁడు.
(హైమవతి కాక కడమవారెల్లరు నిష్క్రమింతురు)

హైమ—(ఆందోళనముతో) ఆహా! చంద్రమౌళిశాస్త్రిగారి నోటి
నుండి హత్యావిషయములైన భాషణబాణములు బయల్వెడలి
మదీయవిస్తులధైర్యస్థైర్యవ్యూహములు ఛేదించివైచి యాందో
ళన కెడ మొసంగెనుగా? ఘోరా! మున్ను నామగనినోటినుం
డి చనుదెంచినభయదభీషణగర్జారావమే ఇప్పుడీశవమునందు
స్పష్టీకరింపఁ బడినవి. అయ్యయో! దెబ్బతినిన యుద్రేకమునఁ
బట్టి యట్టిప్రతిజ్ఞ గావించి రనుకొంటినికాని యింత వచ్చు నని
తెలియనైతిని అబ్బా! యెంతక్రూరకృత్య మాచరించిరి?
గవర్నమెంటువారి కీమర్మ మేమయినఁ దెలిసినచో నెంతముప్పు
సంభవించునో? ఎంతకఠినశిక్ష విధింతురో? (కొంచెమాఁగి భర్తృ
పటమును జూచి) ఆర్యా! నీరజంబులఁ బోలిన భవదీయసుకు
మారకరము లెట్లోరులప్రాణములు తీయఁ గల్గినవి. అమితశాం
తమూర్తివైననీ కంతటియాగ్రహ మెట నుండి వచ్చినది? లేక
యిదియంతయు నాభ్రాంతియా? ఔనౌను. ఆనిర్మలాకారుఁ

డా ఆభక్తితత్పరుఁడా నిజముగ నీకుష్టకార్య మాచరించువాఁడు కాఁడు కాఁడు. (లేచి) ఏఁడీ నానాథుఁ డెటుపోయినాఁడు ? బహుకాలదర్శనమైనంగులకు మనసార మాట్లాడుటకైన నవ కాశము చిక్కినది కాదే. రక్షకభటులకుఁ జిక్కి రచ్చకెఁగెనా యేమి ? అయ్యో ! ఇఁక దాచనేల నాయత్తమామల కీరహస్య వృత్తాంతమంతయుఁ జెప్పుకునా ? (నిట్టూర్పుపుచ్చి) అబ్బా ! నామతి చలింపుచున్నది కన్నులు తిరుగుచున్నవి. కాళ్ళువణఁకుచున్నవి. కటకటా ! యేమిచేయుకును ? తెరువెయ్యది ? అయ్యో ! యేది నానాథునాపదఁ బాపుమార్గము ? హా ! (సోఫాపైఁ గూలఁ బడును.)

(తెరపడును.)

---

చతుర్థాంకము—ద్వితీయరంగము.

[డేన్సింగ్ హాలునందు రాస్కెల్సు ఆలోచింపుచు గూర్చుందురు.]

శ్యామ—శివరావు! కర్తవ్యమేమిరా ?

శివ—ఎంతటూమచ్ గా నున్న ప్పటికిఁ గార్యములపట్ల జాగరూకతగానే వర్కుచేయుచున్నాను. మన మాలోచించినప్రకారము మన మైకుగురియొద్ద ఫిఫ్టీన్ థౌజెండ్ రూపీస్ మార్తాండమూర్తి యప్పు తీసికొనినట్లుగా నోట్లు నతిభద్రముగా వ్రాయించి యుంచినాను.

శ్యామ—వ్రాయించినావు కాని యాపైపని పూర్తిచేయుట యెట్లు ?

శివ—అదియే నాకును బెద్దబెడదగా నున్నది.

భాస్క—మనము చేసినమఱపురానిహాళ్యలను మఱచుట కనునెపమున మరింతహెచ్చుగా మార్తాండునిచే మద్యపానము చేయించియు

నాట్యకత్తెచే నాట్య మాడించియుఁ బ్రపంచమును మఱపింపఁ జేసిన నానోట్లపై నిట్టి సంతకములు చేయించ వచ్చును.

దుర్గా—యస్సాల్ రైట్.

అప్ప—(ప్రవేశించి) అయిందా లేదా! మీమామాలోచన బాబయ్యగా రొచ్చేత్తుండారు.

శివ—దుర్గారావు! నీ వెను రేఁగి యీ రేయి మనదగువినోదవృత్తాంత మంతయుఁ జెప్పి డ్యాన్సింగ్ గరల్‌ను తీసికొని రమ్ము.

దుర్గా—ఉఁ...(రాఁడీ చనును.)

మార్తాం—(సంతోషముగాఁ బ్రవేశించి) హల్లో! డియర్ ఫ్రెండ్సు! ఒక్క డ్యాన్సన్న మాటేమి? ఈడే మొదలు మాఫాదరు బిజినెస్సంతయు మనమీఁద విడిచిపెట్ట నున్నాఁడు. వన్ డేకి హండ్రెడ్ డ్యాన్సెస్ చేయింప వచ్చును. థౌజెండ్ బ్రాంది బాటిల్సు త్రాగ వచ్చును. ఏదీ డ్యాన్సుగరల్.

శివ—వచ్చుచున్నది కాని బ్రదర్! మీనాన్నగారు బిజినెస్సంతయు నిన్ను మేనేజ్ చేసికొ మ్మన్నమాట సత్యమా!

మార్తాం—సత్యమా యని నెమ్మదిగా నడుగ నేల? ముమ్మాటికి సత్యమే. ఏదీ! నాట్యకత్తె యగుమననాగరత్నము?

భాస్క—(బ్రాంది గ్లాసులోఁబోసి) అదిగో! వచ్చుచున్నది. ముందొక పెగ్ తగిలించుము (ఇచ్చును.)

నాగ—(ప్రవేశించి) గుడ్ నైట్ సార్!

మార్తాం—ఏదీ! వన్ కిస్! (ముద్దిడి) ఈనాఁడు నీనాట్య మతిరమణీయముగ నుండవలెను. ముందు దీనిని సేవింపుము. (బ్రాందినిచ్చును.)

(రాస్కెలుసకూడఁ ద్రాగుచుందురు.)

అప్ప—అగ్గినిప్పునాటి యీబరంది అద్దూపద్దూ లేకుంటా తాగి అడా బిడిసేత్తూ బో ర్లెండఁబెట్టుకోటమే కాని యేమినాబం! నాను

తాగి పోత్తాడికల్లునాటి ధోకనెలపా టిడకుండా మేసుకుంతే
నాకుమల్లే అచ్చోసినాంబోతులాగ నిగనిగలాడతా వూరిపోరూ!

మార్తాం—ది బెస్ట్ ఫేస్సు వెరై టీడ్యాన్సు ! ఏదీ ?

నాగ—(నాట్య మాడుచుండును.)

[అంత సుగుణశీలుఁడు, చంద్రమౌళిశాస్త్రియుఁ బ్రవేశింతురు.]

సుగు—శాస్త్రిగారూ ! త్రిప్పి త్రిప్పి కడకు మాపుత్రునివాసస్థలమునకే తీసికొని వచ్చితిరే. అబ్బా ! ఎడమకన్నదరుచున్నది. మనమిల్లు బయలుదేరినదిమొదలన్నియుఁ దుశ్శకునములే కల్గుచున్నవి.

చంద్ర—దుష్టపుత్రులను గనినమనకు దుశ్శకునములుకాక సుశకునము లెటు లబ్బు ?

సుగు—ఏమీ ! చాలవిపరీతవాక్యముల నాడుచుంటిరే ?

చంద్ర—విపరీత మేమున్నది. ఇటు రండు. ఇదిగో నీగవాక్షమునుండి తేరిపాఱఁ జూడుఁడు.

నాగ—(నాట్య మాడుచుండ మార్తాండమూర్తి బ్రాంది త్రాగుచు ఆమె వెంటఁ దిరుగు చుండును.)

సుగు—(నిశ్చేష్టుఁడై) ఆఁ ఏమీ ! ఏమది ? శాస్త్రిగారు! ఆవిద్యుద్దీప కాంతిలోఁ దళతళలాడుచు మామార్తాండమూర్తియా యామె చేతను గీలుబొమ్మయై యాడుచుండెను ?

చంద్ర—ఆర్యా ! బెగలకుఁడు.

తే. గీ. గరళమును గ్రోలి మత్తెక్కి కాముకుఁడయి
శివుఁడు తిరిగినభంగి శ్రీశేధవుని వెంట
మద్యపానినై యాతఁడా మగువఁ గూడి
చిత్తకార్తికుక్కయె యయ్యెఁ జిత్రమేమి ?

సుగు—అక్కటా ! యెంతవెంగిలి యయ్యెను ! ఆతినుచున్న దేమై యుండును ?

—ఆమె మొంగిలితోఁ గలిసినమాంసాహారమై యుండ వచ్చును.

చంద్ర— ! ఇసీ! మార్తాండా! నీశీలమంతయు నేబావిఁ బడఁద్రోసితివి?

సుగు—ఇఁ. వీనిళ్చలబుద్ధి కీహీనచేష్ట లెట్లు సంప్రాప్తములైనవిరా! అక్కటా! పాపకూపమునఁ బడియున్న నాపుత్రునిఁ బైకి ఆర్యా! నే నేఁగ ిందుండుఁడు. (పోవఁ బ్రయత్నించును.) తీసికొని వత్తును మీ మి మీసాహసము! యెట్టియెడ

చంద్ర—(అడ్డగించి) అమ్మయ్యో! ను కాని యీపాడుత్రాగుఁ కయినఁ జోఁబవఁ జేసి పరుగిడ వచ్చు కాదు. బోతులనడుమకుమాత్రము పోవ నయము

సీ. క్రూరఘోరాహిని | గూడ గానంబుచే
నిట్టనిలిపి బుట్టఁ | బెట్ట వచ్చు
మేటిబెబ్బులినైన | వాటముగా లేడి
నొనరించి యాడింప | ననువుపడును
నలిదుష్టబుద్ధిని | సతులతోనే సాధు
వర్తనఁ జేయఁగ | వలనుపడును
భీతిగొల్పెడిక్రూర | భీమణసింహంబు
నైనను నవలీల | నడఁపఁ గలుగు

గీ. నట్టిజగజెట్టు లీభువి | నలర గంటిఁ
గాని యీఘోరపాపౌఘ | హీననరక
దాయకం బగుబ్రాందిని | ద్రాగువారి
కాగరళకంఠుఁడైనను | నడల వలయు.

సుగు—ఔరా! ఇప్పుడింకేమొనర్పఁగు (విచారించును.)

శ్యామ—బ్రదర్! దీనిపైఁ గొంచెము సంతక మిడుము.

మార్తాం—కొంచె మేమిటి వన్ పెగ్ బ్రాండి యిచ్చి పూర్తిగా వంద సంతకములు చేయించుకొనుము. (శ్యామలరావిచ్చిన బ్రాంఢి త్రాగుచు నోట్లపై సంతకములు చేయును.)

సుగు—అయ్యయ్యో! మరలఁద్రాగుచుండె నే మద్యసముద్రమున నట్లు కొట్టుకొనిపోవు నాతనయుని దరిఁ జేర్పవద్దా! పిమ్మట నేమైనఁ గానిండు (లోనికేఁగి మార్తాండుఁడు త్రాగుచున్న గ్లాసుఁ బడఁ గొట్టుచు) తనయా! నీ ముద్దునోరా యీహీనపదార్థమును సేవించుట.

మార్తాం—(మహాకోపమున) ఆఁ యెవఁడవురా నీవు! రాస్కెల్! (గ్లాసుతోఁ దండ్రితలపైఁ గొట్టును.)

సుగు—ఆఁ ఆఁ హా! (మూర్ఛిల్లును.)

చంద్ర—అయ్యయ్యో! యెంతప్రమాద మెంతప్రమాదము! అబ్బా! నెత్తు రెంతవడిగాఁ గారుచున్నది? (శైత్యోపచారములు చేయును).

మార్తాం—నానోటియొద్దపదార్థమును బడఁగొట్ట నారాయుఁడునికైనఁ దరము కాదని యెఱుఁగవురా? డేమెట్! (లేచి) నిన్ను మర్దను చేసెదను చూడు.

శ్యామ—(విచారించి) బ్రదర్! కొంచెము శాంతించుము. నీచే దెబ్బ తిని పడియున్నవాఁడు మీఫాదరు.

మార్తాం—(ఆశ్చర్యమున) ఆఁ—ఎంతపొఱపాటు జరిగినది! అట్లయిన నిమ్మళ్లెంటుగా నొకయవున్సుబ్రాండి యిచ్చి లేవనెత్తండి!

సుగు—అబ్బా! హార! హార! (బాధపడుచుండును)

చంద్ర—క్రూరవ్యాఘ్రసముదాయ మని చెప్పిన వినరయితిరి కదా!

మార్తాం—(తూలుచు) థ...థ...తండ్రీ- ఎక్సుక్యూజ్ (తండ్రిచెంతఁ జేరును)

సుగు—ఛీఛీ! దుర్మార్గుఁడా! నీవా నాపుత్రుఁడవు? కావు. నీవొక చండాలుఁడవు (కారుచున్నరక్తమునుఁ జూచుకొని) హా! హా!

ఈరక్తమంతేయు నేమి? నాతల పగిలిపోయినదా? హా! (స్మృతి తప్పి పడును.)

మార్తాం—(పెద్దపెట్టున నవ్వుచు) హహో! సుగుణశీలుఁడు శూరశిఖామణి యయ్యెనే. అరే! అప్పలస్వామి! కమిన్! కమెలాంగ్! సూన్!

అప్ప—(కడువడిగా వచ్చి తనలో) తాగి ఒక్కాడెచ్చుగా తొంగుడ్డో కిదేంగోలోస్ (పైకి) యేంబాబయ్యగోరు పిలిసేనారు?

మార్తాం—ఈముసలిపీనుఁగుల నిద్దఱను నావల కీడ్చివేయరా!

అప్ప—ఈయస్నక్కడికొట్టికె ల్లొడెయ్యాలిబాబూ! డాగుదొరకా డొడేసేదా!

చంద్ర—ఓదురాత్ములారా! మీరంటకుఁడు; గాయము మరింత బాధ పెట్టును.

అప్ప—నడు నడేస్! పెద్దకబు ర్లాడతుండావ్ (చంద్రమౌళిశాస్త్రిని గెంటుకొని పోవును.)

రాస్కెల్సు—(సుగుణశీలుని మోసికొనిపోవుదురు.)

మార్తాం—(వినోదముగాఁ జూచుచుఁ బెద్దపెట్టుగా నవ్వుచు నాగరత్నముచెంత కరుదెంచి) నాప్రేమలరాణీ! లేవే లేవే నాలేడీ! మన కడ్డువచ్చినచవటల నవతల కీడ్పించేను లే లే మనబెడ్‌రూముకు పోదాము. మన మిప్పుడున్నా హాల్‌కు భూకంపంవచ్చింది. (తూలుచు) హి. హి. హ్హి. అఁ వచ్చింది భూకంపం వచ్చింది. లేవకపోతే చూడు మరి నీబుజ్జకంపం వదలఁగొడతా. (కొట్టఁబోయి) కోపమేల కోమలీ! పోని పెగ్గిస్తా నాతో పేల్తావా? (బల్లయొద్దకుఁబోవుచుఁ దూలిపడి కోపమున) హారే డేమెట్! ఘావఁడెవురా నీవు? నన్ను త్రోస్తావుగా కబడ్దార్. పొరుమేంవుంటే ఊదుయగావచ్చి దెబ్బలాడరా రాస్కెల్! మడేమెయిర్! ఈమూఁ

దులోకాల్లో యెవఁడు నాతో దెబ్బలాడేమొగాఁడు. హి. హి. హీ. పారిపోయెదరేల? నాతో దెబ్బలాడలేక! నే నిప్పుడెక్కుదున్నాను. హి. ఎయిరోప్లేన్ మీఁద వెరీ వెరి థేంక్సు! నా చుట్టు ఈచెయిర్సు ఈటేబిల్సు గీబిల్సు అన్నీ గిఱ్ఱుమని తిరిగిపోతున్నాయి (తూలుచు) బలే బలే గేలాప్ గేలాప్ (అటు నిటు పరుగిడుచుఁ బడిపోవును.)

(తెర పడును)

ఇది చతుర్థాంకము.





# ఫోర్ రాస్కెల్స్.

అను,

## పతిసేవనాటకము.



పంచమాంకము:—ప్రథమరంగము.

స్థలము—గృహాంతరము.

[ప్రవేశము:—సుగుణశీలుఁడు తలకుఁ గట్టుకట్టుకొనియును, సుగుణవతి హైమవతు లిరువురుఁ జేరియొకప్రక్కను చంద్రమౌళిశాస్త్రియుఁ గూర్చుండెదరు.]

సుగు—(నిట్టూర్పు నిగిడ్చి) ఓపరమేశ్వరా!

చ. ఒకపరి నీదునామమును నొప్పుగఁ బల్కినయంతనే దయన్
సకలశుభంబులే యొసఁగి చాలఁగ సాకెదువాఁడ వంచు నే
సకృతభవత్కథామృతమె శాంతమతిం దగఁ గ్రోలుచుండఁగా
సుకముల నిచ్చి బ్రోపకయె చూచుట యొప్పున పార్వతీశ్వరా!

అబ్బా! ఇంకను నెలదినములకుఁ గాని నాగాయము మానదని వైద్యులు చెప్పి వెళ్లిరికదా! అక్కటా! మాపంచప్రాణములను నెవనియందు లగ్నముఁ జేసి జీవింపుచుంటిమో! ఎవఁడు సుగుణసాంద్రుఁడని సంతతమానందాబ్ధి నోలలాడుచుంటిమో ఆతఁడే దుర్గుణసాంద్రుఁడు, దుర్వ్యసనపరిపూర్ణుఁడు, స్త్రీలోలుఁడును నయి చేయరానిక్రూరనీచకృత్య

ములఁ జేయుచు మత్పూర్వార్జితయశశ్చంద్రికను దమస్సాగరమున ముంచుచుండ సిగ్గు వీడి నలువురలో నెట్లు మసలగలము.

చంద్ర—మీరిట్లు కించపడ నేల? ఎట్లో యూఅటనందుఁడు.

సు,వతి—నాథా! విచార మేల? కాశీప్రయాణము నిశ్చయించుకొంటిమి కదా! మీకుఁ గొంచెము స్తిమితముగ నున్నపిమ్మట నాపురమున కేఁగి మనజీవిత శేషమట దానధర్మతపోయాగాదులతో సంతోషముగాఁ గడపుదము.

సుగు—అట్లే యెంచితిని కాని గుణవతియగుమనకోడలి నాదుర్మార్గుని బాఁబడఁజేసి బాధింపవలసి వచ్చు నని యాలోచింపుచుంటిని.

చంద్ర—అమ్మా! ఇంతమాత్రమునకే యూరువిడిచి పోవలయునా? కష్టములు కలుగనివా రెవ్వరు? చూడుఁడు-

సీ. సమయంబు తప్పఁగా సార్వభౌముఁడు గూడఁ
బడరాని యిడుములే పుడమిఁ బడఁడె
సమయంబు తప్పఁగా సర్వేశ్వరుఁడుఁగూడ
భస్మాసురునిచేత బాధపడఁడె
సకు_బాయినిగూర్చి యక్కమలాక్షుండు
కరినరద్విపులచేఁ గట్టుపడఁడె
జగ ముద్ధరింపనై జన్మంబు నెత్తిన
గాంధిజీ జైలులో గాసిపడఁడె

తే. గీ. చెట్టలకు నట్టివార లే కట్టుబడఁగ
మనయిడుము లెక్కలెక్కయా మహిని మాన
వాళి కాదినో మధ్యనో యంతముననో
తప్పకయె యెట్టో కష్టముల్ దాపురించు.

సు,వతి—వారిపాటుఁ జూచి నేనట్లంటిని కాని కోడలిమాట యటుండుఁడు. నవమాసములుమోసి కని యెంతయో ముద్దుగాఁ బెంచి

విద్యాబుద్ధులు నేర్పించి యతనికిఁ గించిద్విపత్తేదియైన సంభవించుఁ గొండ కూలి మనమీఁదఁ బడినదో యనినట్లు విలపించుచున్నాము. అట్లు త్యానందముగ సాకఁబడుచున్న పుత్రుఁ డిప్పటికి దుర్వ్యసన నిమగ్నుఁడై గుర్వార్గుఁడై తప్పు తెలియక తండ్రినే హింసించునంతటి యవివేకి యయ్యెను గదా యని నామానస మెంత క్రుళ్లి కృశింపుచున్నదో భగవంతునకే తెలియును. (విచారించును)

హైమ—అత్తగారూ! ఊరడిల్లుఁడు. ఇది యంతయు నా పాపఫలము.

సుగు—దేవీ! యెట్టివాఁడైనను దప్పునా? ప్రస్తుతము ప్రయాణ మాఁపి పుత్రునిబుద్ధి మాఱ్ప యత్నించుటయే తరణోపాయము (నిట్టూర్పుతో) ఆబ్బా! ఎన్ని వర్తమానములు పంపించిన నింటికిఁ జేరకుండెఁగదా! అక్కటా! ఎట్టివాఁ డింతలో నిట్లయ్యెను!

సుమతి—వానిదూతలు వాని నింతలో రానిచ్చెదరా?

హైమ—ఇప్పుడు పంపించినవార్తకుఁ దప్పక రావచ్చును.

సుగు—(స్మృతి నభినయించి) ఆఁ-మఱచితిని శాస్త్రిగారూ! ఒకరహస్యవిషయమువలన మీమతి చలించినట్లు మొన్న మాతో నంటిరి కదా! దానికిఁ గారణ మామార్తాండుని మాఱ్పగునా?

చంద్ర—ఆఁ అదియే—కానీ—

సుగు—కానీ!—యని సంశయింపు చుంటి రేమి?

చంద్ర—అల్లదుగో! వచ్చుచున్నాఁడు మీపుత్రుఁడు.

హైమ—(లేచి చూచి) అమ్మయ్యో! యే మావాలకము?

మార్తాం—(తూలుచుఁ బ్రవేశించి) ఓహో! బెనారక్స ప్రయాణ ధురీణులు కాఁబోలు!

సుమతి—తండ్రీ! ఏ ధురీణులము కాము, నీతోఁ గొన్ని విషయములు మాట్లాడవలెను, కూర్చుండుము.

మార్తాం—ఇచ్చటి కేనిపుడు కూర్చుండుటకు రాలేదు. తౌజెండ్ రూపీస్ అవసర ముండి వచ్చితిని. అర్జెంటుగా ఇచ్చి పంపుఁడు. నాకై నాఫ్రెండ్ డ్సావలనిలిచి నిరీక్షించుచుందురు.

చంద్ర—ఈపాశపంచక మెంతను నెడఁబాసి యుండ దని నే నెఱుఁగుదును. లోనకు దయచేయుమనుము

మార్తాం—అవసరమైన నట్లనుటకే యందుంచి వచ్చితిని.

చంద్ర—అట్లా!

మార్తాం—కాకమ రియింక నెట్లు? అది గ్రహించుకొని నన్నావల కతి శీఘ్రముగఁ బంపివైచి మీామర్యాదఁ గాపాడుకొనుఁడు.

సుగు—బాబూ! మార్తాండా! నీబాగుఁ గోరి కొన్నిసంగతులు చెప్పనున్నాను. అంతగాఁ గస్సుమనక తండ్రి యని కొంచెమాలోచించి నామాటలను సాంతముగా వినుము.

మార్తాం—ఇదుగో ఇందుచేతనే నే నింటికి వచ్చుట మానుకొని యున్నాను: కాని వన్ మినిట్లో మీాసొద తేల్చుఁడు.

సుగు—నాయనా! నిందాపాత్ర మగునీమద్యపానము నాలుమాసములనుండి కావింపు చుంటివి కాంబ్రోలు నప్పటినుండియు నీకు మనశ్చాంచల్య మధికమై మర్యాద నతిక్రమించి మసలుట తప్ప మరి యేమిలాభ మగుపడినది? సుగుణఖని వనిపేరువడసి యిట్లు ప్రవర్తించుట తప్పు కాదా తండ్రీ!

మార్తాం—(పెద్దపెట్టుగా నవ్వుచు) ఓవెఱ్ఱితండ్రీ! ఈమద్యామృతమునందెన్ని గుణము లున్నవో నీ కేమి తెలియును? (జేబులోనిబ్రాండీ సీసా దీసి.)

సీ. ఈమహాదివ్యపానామృత మొకలెక్క-
తరుమును భీతిని। దవ్వులకును

ఈమద్యమే యొంతొ యొక్క వ్యక్తిని మత్త
గజమును నింతలోఁ గట్టఁ జేయు
ఈమహాసారజీ వామృతసేవయే
కడులుబ్ధునిం దాన కర్ణుఁ జేయు
ఈమహారసపాన మే చేరి యొంతేని
ధీరుసైనను వేగఁ దీర్పఁ జేయు

తే. గీ. ఇట్టిసుగుణపుంజము నెంతొ యెపుడుఁ గోర్కె
తీర సేవించువాఁడె పో ధీరుఁ డిలను
కాన దీనిని గ్రోలని వానిజన్మ
జన్మయా కాదు కాదింక జనులలోన.

సుగు—అక్కటా ! దీనియం దింతమూఢదృఢవిశ్వాసము కలిగినయా పశువుతో నింకెంత వాదించి యేమిప్రయోజనము?

తే. గీ. మూఁగవాని చెవ్రల శంఖ ములను నూఁద
వలసె నాదుబోధనలకు వశము కాక
నీచతమ మగుక్రియలను నేర్పఁ జొంది
గురుయశోధనసంపత్తి నరుగఁ జేసె.

మార్తాం—ఇంకను నేమైన నున్నవా మీప్రశ్నలు ?

చంద్ర—అడిగినది యొక్కప్రశ్న యైనను నచ్చుగ్రుద్దినట్లు సమాధానము చెప్పితివి; కాని యొక్కటిమాత్రము చెప్ప మఱచితివి. ఈమహాదరిద్రహేతుభూతమద్యపానమువలన నై మఱచి తండ్రినెత్తిని మొత్తునంతటిశూరుఁ డగు నని కూడఁ జెప్పిన బాగుండెడిది.

మార్తాం—షటప్—డేమెట్ ! నీవు ననేకవిషయములందు మా కడ్డు వచ్చుచున్నావు జాగ్రత్త. ఆనాఁడు నాతాదరని యంతతో నూఱకుంటిని కాని మఱియొకఁడైన మర్దరు కావలసినదే.

చంద్ర—మర్దరులమహిమ యిప్పుడు కాను. తొందరేల ? పాపము పండుచున్నది. ఔను సమర్థుఁడవు నీవలనఁ గానిపని యేమి ? కాడీలనెల్లరను చించి చెండు రణనీతివిశారదుఁడవు.

(సుగుణశీలుఁడు, సుగుణవతి, హైమవత్యాదులు నిశ్చేష్టులగుదురు.)

మార్తాం—(భయభ్రాంతితో దనలో)ఆహా ! విధికిగూడఁ దెలియు నసాధ్య మారీతిని నెరవేర్చిన మాహాత్మ్యరహస్య మెట్లీతఁడు గ్రహించెనో ? కాక నేనేమైన భ్రాంతిపడుచుంటినా ? అబ్బే ! ఇంత నొక్కి నక్కాణింపుచున్న యీతనిమాటలయం దింకేమి యంతరార్థ మున్నది ! అట్లయిన నీతఁ డెట్లో మాగుట్టంతయు గ్రహించియే యుండవచ్చును. దీనికై యింతయాలోచన యేల? వీనిమెఱుక యనునగ్నికణము ప్రజ్వరిల్లి దావాగ్నియై మమ్ము దహించునంతదాఁకఁ గూడ రాఁ గలదు. కాన మాప్రమాణ ప్రకార మీకుత్సితబ్రాహ్మణునిఁ గూల్చుటయే యుత్తమము.

చంద్ర—నాభాషణములతో నీవేమట్లు భయభ్రాంతుఁడవై, నిశ్చేష్టుఁ డవై, కంపితహృదయుఁడవై దీర్ఘాలోచనాబ్ధిఁ దేలియాడుచుం టివి. ఓవెఱ్ఱివాఁడా! మౌర్ఖ్యమును వీడుము. మార్జాలము చట్టి లో శిరము నిమిడ్చి పాలు గ్రోలునప్పుడు తన్నెవ్వరును జూడ రనియే యభిప్రాయపడునట్లుగా—(అర్ధోక్తి.)

మార్తాం—(కోపమున) ఓరిఫూల్ ! మార్జాల మట్టిదే కాని వీఁడు సింహమని యెఱుఁగుము. కుంభికుంభమును గడుపారఁ గ్రోలు గండరగండఁ డని యెంచుము. ఈపురుషసింహునికార్యముల కెవఁడడ్డువచ్చినను (రివాల్వరుఁజూపి) ఇదిగో ! యీ విధమునఁ గాలునిచెంతఁ జేర వలసినదే. (ప్రేల్చును)

చంద్ర—హా... (నేలకు నొరగును)

అంతయు—హా... హా... ఘోరము! ఘోరము ! (విలపింతురు)

**మార్తాం**—షటప్! రాస్కెల్సు! యేమాగోల? పొండావలకు. (రివాల్వరు గుఱిఁ జేసి ఆక్షేపణగా) ఓహో! మిమ్ము కాశీప్రయాణ ధురీణు లని మఱచితిని. మరి యమగ్గంటుగా నారోడ్డు పట్టుఁడు. లేక యిచ్చట నోరెత్తినచోఁ గాశీపుర మటుంచి కాలునిపురముఁ జేరఁ గలరు. ఊ... పొండు.

(సుగుణవతి, హైమవతియు నేడ్చుచుఁ జనుదెంచిరు.)

**సుగు**—అక్కటా! మాయాశలన్నియు నిరాశ లైనవి. మా ప్రేమానుబంధ మీగడియతోఁ బూర్తిగాఁ దెగినది. హా! మిత్రుఁడా! నేఁటితో నీకాయువు మూడెనా! అయ్యయ్యో! ఎంతదారుణ మెంతదారుణము! (పుత్రు నుద్దేశించి కోపమున) ఓరీ నరరూప ఘోరరాక్షసాధమా! ఈపూజ్యుఁడు—

సీ. శివునిపదాంభోజ ♦ చింత చేయుటె కాని

చేయఁబోఁడు పరార్థ ♦ చింత నెపుడు

సత్యవాగ్భాజన ♦ సాంగత్యమే కాని

సలుపఁ బోఁ డన్యమా ♦ చెలిమి నెపుడు

దురితకర్మరునైనఁ ♦ గరుణఁ గాంచుటె కాని

ఖలుఁ డని వానిపైఁ ♦ గనల డెపుడుఁ

బరమసుజ్ఞానద ♦ భవ్యవాక్కులె కాని

పలుకఁ బోఁ డన్యదు ♦ ర్భాష లెపుడుఁ

తే. గీ. బరమనిష్ఠాగరిష్ఠుఁడై ♦ పరఁగువాని

బ్రాహ్మణార్యుని క్రూరతఁ ♦ బాప మనక

చంపి గడియించినయఘంబు ♦ జన్మశతము

లెన్ని యెత్తినఁ దీరునో ♦ యెంచు సుంత॥

(నిష్క్రమించును.)

**మార్తాం**—పోరా ఫూల్! ఇక్కడి కీలంకెకూడ వదలి మాయాస్తి యుంతయు నాస్వాధీనమై యున్నది. భళి! ఏమి నాఛాన్సు!

**హేమ**—(ఆత్రమున వచ్చి) నాథా! నాథా! చంద్రమౌళిశాస్త్రిగారి తనయుఁడు తనతండ్రిపాటు తెలిసికొని కాఁబోలుఁ జాలమంది జనులతో వచ్చుచున్నాఁడు. మన మిందుండినఁ బ్రమాదము. ఎందైనఁ బోవుదము రండు.

**మార్తాం**—ఛీ! పొమ్మిచ్చటుండి. (గెంటును)

(రాస్కెల్సు, అప్పలస్వామియుఁ బ్రవేశింతురు)

**మార్తాం**—(ఎదు రేఁగి) హల్లో! డియర్ ఫ్రెండ్సు! గుడీవినింగ్! మిష్టర్ శివరావు! మొన్న మన మొనర్చిన హత్యానంతరమున నారహస్య మెవ్వరు తెలిసికొనినను మదకు మనమాతాపితలనైనను నితరాలోచన లేకయే యమమందిరముఁ జేర్చునటులు మన మానాఁడు బ్రాందితోఁ బ్రమాణము చేసికొంటిమి కదా! ఇదిగో! ఈనాఁ డారహస్యము గ్రహించినవ్యక్తి నాతో వాదింప నీవిధమున మర్డరుచేసితిని (చంద్రమౌళిశాస్త్రిని చూపును.)

**శివ**—హా! తండ్రీ! (శవముపైఁ బడి) నన్నుఁ బాసి పోతివా! కృపాంతరంగకటాక్షవీక్షణాల నన్నీభువి నింకెవఁ డరయువాఁడు? ఆర్యా! యేల మాఱు పలుకవు? నేను భ్రష్టుఁడ నగుటచేతనా? నీవు బ్రతికియున్నంతకాలము నాకై వెతలనే యనుభవించి తుద కీగతి నందితివా! హా! పరమాత్మస్వరూపా! (విచారించుచుండును.)

**మార్తాం**—బ్రదర్! ఆఁడుదానివలె నేడ్చుచుంటి వేమిరా! లెమ్ము. విచారసంహారి నొకపెగ్గ్ తగిలించుము.

**శివ**—అక్కటా! జనకా! యింక నాతో మాట్లాడవా? అయ్యో! ఇంక నాజననిమో మెట్లు వీక్షింపఁ గలను. హా! నాచేతులార

నిష్కారణముగ నిన్నీదుర్మార్గునిపాల్టఁ బెట్టితినికదా! (విలపించుచుండ.)

మార్తాం—బ్రదర్! విచారముఁ బారద్రోల మందు బ్రాందిసేవించరా! (బ్రాంది యివ్వఁ బోవును) పుట్టినవాఁడు గిట్టక యుట్టి కట్టుకొని యూఁగుచుండునా! మా సలిపీనుఁగు చచ్చినాఁ డని ముదము చెంక టకుమాఱు బోరుమని యేడ్చెద వేల?

శివ—(కోపమున బ్రాందిపాత్ర క్రిందఁబడునట్లుకొట్టి) డేమెట్! ఇప్పటున మేమందఱముఁ గలిసి నిన్ను మర్దరు చేసిన నీ కిక్కడ దిక్కెవ్వరురా?

మార్తాం—(నవ్వుచు) ఏమియాశ్చర్యము! మిత్రులు శత్రులైతిరే! పరులకు హానులు చేయుసమయములం దీవిచార మేప్రక్క కేఁగెనో?

సీ. పరధర్మపత్నుల | బల్మిని చెఱఁ బట్టి
కానిపనులఁ జేయు | లేనిచింత
మార్గమునఁ జనున | మాయకులతలలఁ
బో నడిచినాఁడు | లేనిచింత
నాతండ్రితల రక్త | పాతమ్ముగా మోది
కానఁ బడిననాఁడు | లేనిచింత
కడకు నొక్కని మొన్నఁ | గడ తేర్చి యాయాత్రి
పీనులఁ జొచ్చిన | లేనిచింత

తే. గీ. అహహ! యీనాఁడు నీతండ్రి | యఱిగినంత
నింతపెంపుఁ జెందెనె దుష్ట | చింత నీకు
సిగ్గు తెలియనియోనీచ | జీవ! హి హి హి
వంత మూనఁగ సుంతైన | చింత లేదె?

శివ—ఛిఛీ! దుర్మతీ! కట్టిపెట్టుము నీ మెట్ట వేదాంతమును. ఓ మిత్రులారా! ఇప్పుడు వీనివలన మాకుఁ జేకూరెనహాని మీకుఁ గూడ నెన్నటికైన సమకూడఁ గలదు కావున నిఁక నింతటితో వీనినిఁ గడతేర్చుటయే యుత్తమము. మీరు దఱు సంసిద్ధులై యుండుఁడు.

రాస్కెల్సు—ఊఁ రెడీ! ఫుల్లీ రెడీ! (అట్టహాసము చేయుదురు.)

హైమ—(ఒక్క ప్రక్కనుండి) అమ్మయ్యో! ఇప్పు డేదిగతి?

మార్తా—ఓ వెఱ్ఱివిధవలారా! మీరట్టె యట్టహాసము చేయకుఁడు. శివరావు! నీతండ్రిని కాలునిపురికి నాతండ్రిని కాశీపురికిఁ బంపి మనపీడ వదలఁ గొట్టితిని ఇఁక మనయిష్టము! అంతా ధనమే! అంతా బ్రాండే! వరల్డ్‌లోని సౌఖ్యమంతా మనకు వశమే! ఇంకేమిలోటు. బ్రదర్! యోచించి విడిచిపెట్టు నీ వెఱ్ఱికోపమును.

శివ—అట్లయిన నేఁ జెప్పినట్లె యొప్పుకొన్న నీమేన నిఁగనైన ప్రాణ మియ్యను. ఎట్లన, నీయాస్తి సమస్తమును నాకు సగము చెల్లునట్లు వ్రాసి యిమ్ము. అట్లు కాదన్న (మొలలోనిబాకుఁ దీసి) ఇదిగో! నీవిధమున మరణము కాఁగలవు నీకది యిష్టమా! లేక యిది యిష్టమా! అన్నదే ముఖ్యమైన పాయింట్.

రాస్కెల్సు—వెరీ గ్రాండ్ క్వశ్చన్.

మార్తా—మృత్యుకళ మూర్తిభవించి యున్న నీకేమూర్ఖాండమూర్తిహిత వాక్యము లెట్లు చెవుల కెక్కును! చెడెదవు సుమా!

శివ—చెడ నెంచియే యిట్టికార్యములు చేయ సాహసించితిని. మిత్రులారా! యోచించెద రేల? నే నీతులువను తుదముట్టించెదను కాని మీ రీయింట నున్నధనమంతయు వెంటనే సంగ్రహించి తెండు పొండు.

**మార్తా**—ఓ నీచులారా ! సహస్రకిరణోజ్వలప్రచండకరతుల్యమార్తాం డమూర్తియుండనా మీయాగడములు ? మీరందఱు కౌడీలు మాత్రమే. నేనో కౌడీలనెల్లరను చించి చెండాడు రణనీతివిశారదుఁడను. రాస్కెల్సు (రివాల్వరుతో శివరావును ప్రేల్చును)

**శివ**—హా ! (నేల కొరఁగును).

**అందఱు**—హా ! హా ! ఘోరము ! ఘోరము ! మర్డర్సు ! మర్డర్సు ! (పరుగిడుదురు.)

**మార్తా**—(నవ్వుచు) ఈశూరులందఱు దారి తీసినారు. సాహ్రైం డని నేను మెత్తఁగా మాట్లాడుటచేత నీతఁడు కత్తి నెత్తి నాపై కుఱికి మదకుఁ ద దముట్టినాఁడు. (త్రాగు చుండును.)

**హైమ**—హార ! హార ! కన్నులు తిరుగు చున్నవి అమ్మయ్యో ! ఒక్క యింగటలో రెండుహత్యలా ? యెంతదారుణము ! (విని) ఏమీకలకలము ? (చూచి) హా ! ఇంక నానాథుఁడు నాకు దక్కుట కల్ల. (పతికడకుఁ బరుగున వచ్చి) నాథా ! నాథా ! గవర్నమెంటువారికీహత్యావిషయములు తెలిసి మిమ్ముఁ బట్ట వచ్చు చున్నారు లెండు లెండు.

**మార్తా**—ఓహో ! వారు నిజముగ వచ్చుచునే యుండిరి కాన నా మర్యాదకలవారికి మధ్యఁద్రోవలోనే బుద్ధిచెప్పి పంపుట మంచిది. (రివాల్వరు ప్రేల్చఁబోవ నది ప్రేల కుండుట భయముచే నలుదెసలు తిరుగుచు) అయ్యయ్యో ! ప్రమాదమే తూటాలన్నియు నైపోయినవి. ఇప్పు డేమి చేయుదును? హా! వీరందఱు నప్పుడే మాయింటఁ బ్రవేశింపు చుండిరే? పారిపోదునా? ఛిఛీ! హా ! మరేమి చేయ నగు- డెన్ ఆబ్బా ! కర్తవ్య మేమియు స్ఫురింప కున్నదే (తల పీకుకొనుచు) లేక యిందే యెంపైన డాగి

యుందునా ! అబ్బే ! అదియు నసంభవమే ! అలస్యామృతం విషమ్మన్నారు కాన నిప్పటి కిదియే కర్తవ్యము. (పాఁపోవును.)

హైమ—అక్కటా !

ఉ. పోవుచు నుంటివా ప్రియుఁడ ! మూర్ఖత వీరలఁ జంపి నీ వటుల్
పోవదు సుమ్మి కర్మ నినుఁ బొందక, రామునియంతవానికే
రావణుఁ జంపుపాపమును రాజ్యము చేరక మున్నె దృష్టియుం
బోవఁగఁ జేసె నేవిధిని బొందెదొ కర్మను పంచపత్నికిన్.

ఓహో ! ఏమి సాహసకృత్యములు! తలుపులను దీసిన నాలస్య మని గగనోన్నతప్రాకారములను గూడ నెంతసులభముగ దాఁటు చుండెను. ఓప్రాణనాథా ! మీయర్ధాంగి నగు నే నిందేల ? మీతోడిదాననే. (వెన్నంటిపోవును.)

రాస్కెల్సు—(సబిన్స్పెక్టరు నలువురు పోలీసులను వెంటఁ బెట్టుకొని వత్తురు )

సబి—ఏఁడాదుర్మార్గుఁడు ? కానిపింపఁడే !

శ్యామ—సార్ ! వాఁడు తమరాకఁ జూచి పారిపోయియుండవచ్చును. ఇదిగో ! వానిచే మర్దరుకాఁబడినమాప్రియమిత్రుఁడుయొక్కయు నతని ఫాదరుయొక్కయు మృతకళేబరములు.

సబి—ఆహా ! ఏమి ఆశ్చర్యము ! ఎంతసాహసము ! భటులారా ! మీరీభవనమున నున్నవారినెల్లరఁ దోడ్కొని రండు.

పోలీ—చిత్తము. (వెళ్ళుదురు)

సబి—ఈమార్తాండమూర్తియు మీరును ప్రాణస్నేహితు లఁట కాదా?

శ్యామ—ఔను ! పూర్వ మేదో కొంచెము స్నేహితులమే.

సబి—ఎంతదూర మున్న దాపూర్వము? ఇప్పటికి యీరెండుహత్యలకుఁ బూర్వ మన్నమాట.

పోలీ—[ప్రవేశించి] అయ్యా! యీయింట మనము తక్క మరియెవ్వరును లేరు

సబి—కానిండు. (యోచించి) సార్! ఈహత్య కాఁబడిన మీమిత్రునిపేరేమి?

శ్యామ—శివరావు.

సబి—నీపేరు శ్యామలరావా! అతనిపేరు భాస్కరరావా! ఈతనిపేరు దుర్గారావా! మీయొద్దఁ బనిచేయు అప్పలస్వామి వీఁడే కాఁబోలు?

రాస్కెల్సు—ఔను సార్! అన్నను.

సబి—మీకందఱకు హాండ్ మాగ్జాండమూర్తియా! గ్రహించితి: గ్రహించితి. ఓహోహో! ఏమి సమావేశము! మీరందఱు రౌడీలు వాఁడు రౌడీలనెల్లరను జించి చోడాదురణనీతివిశారదుఁడు. బహుచక్కని కాంబినేషన్! (కోపముగ) రాస్కెల్సు! చాల కాలము నుండి మిమ్ము సరియైనయవకాశముఁ జూచి యణఁచవలె నన్న నెప్పటికి కప్పుడే దాఁటుచుండిరి. ఇఁకెందు పోఁగలరురా! భటులారా! ముందు వీరికందఱకు సంకెలలు తగిలింపుఁడు.

శ్యామ—సార్! యిది యేమియన్యాయము! మే మేకర్మ మెఱుఁగమండి!

సబి—ఏఁ మెఱుఁగరే! ప్రతినిధిమునుచుండును వానికి మీకు సంబంధము కలదు. ఇంతకుఁ గారకులే మీరు.

శ్యామ—సంబంధ మున్నట్లు సాక్షులెవరు? అరెస్టు చేయుచుండిరి కాని జాగ్రత్త

సబి—ఛీ! నోర్మూ కట్టుకొని నడువుఁడు.

పోలీ—(సంకెలలు అందఱకుఁ దగిలింతురు.)



# ఘోర్ రాస్కెల్స్

అను,

## పతిసేవ నాటకము.



షష్ఠాంకము — ప్రథమరంగము.

[స్థలము: — కాశీపురబహిర్భాగమున మార్తాండమూర్తి మాఱువేసమునఁ బ్రవేశించును.]

మార్తాం — (నిట్టూర్పుపుచ్చి) నాఁడు చంద్రమౌళిశాస్త్రిని హానికొడుకును జంపినది మొదలు రెండువత్సరముల నుండియుఁ బ్రభుభటులబారిఁ బడక యనేకగ్రామములఁ బ్రచ్ఛన్నవేషముల నిట్లు మిగులజాగరూకతఁ బ్రవర్తింపుచున్నను నీవారణాశీపురమందున నపరాధపరిశోధకులు గుర్తించి నన్బట్ట నిబిడీకృతవ్యూహముల నెల్లెడలఁ బన్ని యుంచి రన్నయనుమానభీతి మదీయహృదయకోశమునం దావేశింప గర్భకుహరము నాఁకటిజ్వాలలకు నాహుతిఁ జేసి మూఁడుదినముల నుండి యీపురబహిర్భాగముల నిట్లొస్సిరో యని క్రుమ్మరుచుంటిని కఱవులో నధికమాస మన్నట్లు చేతఁ గాసైన లేనియిట్టితఱిఁ గాయజాడ్యములన్నియు నొక్కసారిగా విజృంభించి, కర్తవ్యమును స్ఫురింపకుండ ఘోరపిశాచ

ములట్లు పీకికొని తినుచున్నవి. హా! దుర్భరము! ఆఁకటినొప్పి యో రోగబాధయో కాని భరింప లేను. (మూర్ఛఁబడి యుండును.)

కామ—(అన్నముమూటతోఁ బ్రవేశించి) అక్కటా! ఇందెందును గూడ లేరే! అబ్బా! కాళ్లు బొబ్బలు లేచినవి. కన్నులు తిరుగుచున్నవి. ఓపరమేశ్వరా! ఇంకెంతని నెమకుదును? ఆచెట్టు నీడఁ గొంతసేపు నిలుతునా? (పోవుచు మార్తాండునిఁ జూచి) హా! యేమి నాప్రాణపతియా యిటఁ బడియున్నాఁడు? అయ్యయ్యో! కన్ను లెంతగోఁతున కేఁగినవి!

సీ. నిండుచంద్రునికాంతి నిరసించునెమ్మోము
మాడి యెండను నెంత మాంద్య మయ్యె
గండుతుమ్మెదకాంతిఁ గ్రక్కించు నెరికురుల్
చిందరవందరఁ జిక్కు లయ్యె
బంగరువన్నెను బారఁ ద్రోలెడుమేను
చింకపాతల నిప్పు చేర్చ నయ్యెఁ
బంచభక్ష్యంబులఁ బాటి సేయునిభోగి
పూఁటకు గతి లేక పొక్క నయ్యె

తే. గీ నారా! విధికృత మిట్టిది యనఁగ వశమె
ఘనుఁడె ఘడియలో నీచుఁడై కానుపించుఁ
జెడుగుఁడే తృటిం బూజ్యుఁడై వెలఁగు చుండుఁ
గర్మమే సాక్షి యింతకుఁ గనఁగ నిజము.

అక్కటా! సూర్యునిప్రచండపు టెండ మరింత స్రుక్కఁ జేయు చున్నదే! (ఉపచారములు చేయుచు) ఓభాస్కరా! నీవేల మ మ్మింతకష్టపెట్టెదవు? నీచేతనైనఁ బరమపవిత్రమైన నీసహస్రకిరణజ్వాలలతో నా నాథునిమర్మార్గవర్తనమును దహింపఁ జేయ రాదా!

మార్తాం—అబ్బా! వచ్చితివే! ఓసిరాకాసీ! యీమూఁడుదినముల నుండి యేమగనిచెంత నుంటివే?

హైమ—హర! హర! (చెవులు మూసికొనును.)

మార్తాం—మొఱ్ఱుకవలె నట్లుయుంటివి యేమైనఁ దెచ్చితివా? లేదా?

హైమ—తెచ్చితి నిదిగో! భుజింపుము

మార్తాం—(తినుచు) తినుటకె కాని త్రాగుట కేమైన నున్నదా?

హైమ—ఉన్నది మంచితీర్థ మున్నది.

మార్తాం—ఏమీ! మాయురమా! మంచితీర్థ మున్నదీ! అట్లయిన నిది నీవె త్రాగి నొట్టుకొనుము (తలపైఁ గొట్టును.)

హైమ—దినదిన మిదియే తీరు నాథా! బ్రాందిసారాయములమూలమునవే కదా సుఖ ప్రాప్తు లెల్ల కలిగినవి? ఇప్పటి కైన వానిని మానరాదా! నాయొక్క దేహసుఖ మంతకాలముఁ దమయభీష్టములన్నియు నేఱవేర్చఁ గలిగెను ఇఁక నెట్లు సాధ్య మగును?

మార్తాం—ఏమీ! నీతులుచెప్పనేర్చితివిదాన వైతివే నీచురాలా! ఇఁక నీయొక్క ధన మేమియు లేదే?

హైమ—ధనమే యున్నచో మూఁడుదినములనుండి యుపవాస మొనర్చుచు నిప్పు డీభోజనమునకై కట్టుబట్టనే నేల విక్రయింతును?

మార్తాం—ఓయసత్యప్రలాపి! నాయెదుటనా నీవక్రోటకృత్యలు! కనులు మిరుమిట్లు గొల్పుచు నీకంఠసీమ నలంకరించియున్న యీమాంగల్యము మాత్ర మేల? —గ్రహించును

హైమ—పూర్వాచారపరాయణత్వముఁ బెద్దలు శుభసూచకముగ ధరింపఁ జేసినమంగళసూత్రమును నీచమగుబ్రాందిసారాయము లకై వినియోగించుట న్యాయమా!

మార్తాం—భావ్యాభావ్యములు పదపడి విచారింప వచ్చునులే (త్రెంపి వైచును.)

(తెరలో) అల్లదుగో! హంతకుఁడు పట్టుఁడు పట్టుఁడు.

**మార్తాం**—(అదరిపడి) ఔరా! ఇప్పుడు వీరిరాకకు హేతు వీపాపముం డయే. (కొట్టుఁబోయి) అయినను ఇప్పుడేమయే **నాకు** శరణ్యము. ఓ ప్రాణసతీ! నీపతి నీయాపదనుండి యెట్లు తప్పింతువో నీదే భారము.

**హైమ**—(తనలో) రక్షకభటులతోనా రాద్ధాంతము? అగుఁ గాక! అగ్నింజొచ్చి యల్లలనాడ నేల? (పైకి) **నాథా!** అలజడిఁ బడక యక్రమమునకు నొడిఁగట్టుకొనక **నా** వెనుక నిలిచి యవకాశముఁ జూచుకొని ప్రస్తుతము పరుగిడుఁడు.

**మార్తాం**—ఇది లెస్సయినయోచనయే (అట్లు చేయును)

రక్ష—(ఆయుధహస్తుఁడై ప్రవేశించి) ఏమీ! దేశద్రోహి యయిన మగనిఁ జెట్టఁబట్టుటయే కాక నీవుఁగూడ దేశద్రోహురాలవై పాప మొడిఁగట్టుకొన నెంచితివా యేమి? లెమ్ము వేగమె. పతి దూరము కమ్ము లేదా! నాశతఘ్నిప్రేటునకు గుఱి యయ్యెదవు సుమీ

**హైమ**—ఆహా! ఇప్పుడేది గత్యంతరము?

**మార్తాం**—హైమా! ఘను మందిన న్నీభటుని బారిఁ బడఁ జేసెదవా యేమి? (పిస్తోల్వేటు నవలంబించుకొనును) ఇంక నొక్కనిముస మట్లున్నఁ జాలును

**హైమ**—తప్పించుకొనుట కాక మఱి యేసాహసకార్యమునైనఁ జేయ సాహసించరు కదా?

**మార్తాం**—ఇదిగో! ఇట్టిమాత్రమే చేయుదును (రక్షకభటుని ప్రేల్చి పారిపోవును.)

రక్ష—హా! (నేల కొఱగును)

**హైమ**—అక్కటా! ఎంతదుర్ణయ మెంతకార్ణయము!

[ప్రవేశము—సబిన్స్పెక్టరు.]

స-ఇ—(భటులతో ప్రవేశించి) ఓపాతకీ! దేశసేవాధురంధరుఁ డైన రాజకింకరుని రక్కసుఁ డగునీపతిచే నడఁగింపఁజేసిన నిన్నేమన వలయును! కఠినశిక్షాపాత్రురాలవు కాకుంటవే! భటులారా! నేను వానిని వెన్నాడెదను. మీరీమెను వెంటనే కారాగారమున బంధింపుఁడు (నిష్క్రమించును)

రక్షు—(హైమవతిని దీసికొని పోవుచుందురు)

(తెర పడును)

---

షష్ఠాంకము—ద్వితీయరంగము.

[శృంగారశయనాగారమందు నాగరత్నము అలంకరించుకొనుచుఁ గూర్చుండును]

నాగ—నాయోగము బాగుగా నుండి తెలివి తేజరిల్లుటచే నీళ్లు తప్పించుకొనఁ గలిగితిని కాని లేనియెడల నేనుఁ గూడ వారితోడఁ గారాగారమున నుండ వలసినదాననే నిజముగ నింకను నా తెలివి తేట ఉనుమాట లేమి?

సీ. ఏకశృంగము కల్గు ♦ ఋష్యశృంగునితపో
నిష్ఠ నీవృత్తియే ♦ నీట ముంచె
నపరవిధియె యగు ♦ నాకౌశికుతపమ్ము
చెఱుప నీవృత్తియే ♦ చెల్లె నపుడుఁ
గన్నవానినె చంపఁ ♦ గడఁగె రుక్మాంగదుఁ
డీవృత్తిచేతనే ♦ యిట్టె మన్న
విమలసుజ్ఞాని యజా ♦ మిళ్రనారాయణుఁ
డిప్పగిదినె తినెఁ ♦ జెప్పుదెబ్బ

తే. గీ. అట్టిదేవాంశమూర్తులే యిట్టులైరి
యిప్పుడీకలిపురుషులఁ జెప్ప నెంత
ప్రభుఁడు నుద్యోగి భక్తుఁడు పండితుండు
దేవుఁడైన లంజ కిల విధేయుఁడగుచు.

కాని ప్రభుభయముచేఁ బ్రచ్ఛన్నముగ నుండినయాక్రూరమార్తాండుఁ డెప్పుడైన నాయొద్దకుఁ జేరినఁ దప్పక నాకు ముప్పు వాటిల్లును. ఆతఁ డిప్పుడు భార్యతోఁ గూడ నీకాశీపురముననే యుండ విని, మొన్న వాని యిల్లాలైనహైమవతిఁ బట్టి నేఁడు శిరచ్ఛేదము కావించునట్లు న్యాయాధి కారి తీర్మానించె నఁట పాప మాయిల్లాలిపాట్లు హ్హా—వారిపాట్ల కేమి కాని ముందు నాపాటు చూచుకొన వలయును. బాగుగా నలంక రించుకొని వీధిలో నిలువఁబడిన నేది యైన ఛాన్సు తగులఁ గలదు. (పూలమాలఁ దలకుఁ గట్టుకొను చుండును)

మార్తాం—(ముసుఁగుతోఁ బ్రవేశించి) ఆహా! ఎన్నాళ్లకు మరల నీ దరహాసితవదనారవిందమును దర్శింపఁ గల్గితిని నాగరత్నమూ! ఏదీ! మనసార నీయాలింగనము? (చేరఁబోవును)

నాగ—(గెంటి) ఛీ! ఏమిది పిచ్చివానివలె మీఁదఁ బడఁజొచ్చితివి? దూరమున నుండి మాట్లాడుము.

మార్తాం—(సిగ్గుపడి తనలో) ఆహా! యెంతలో నెంతగ మారెను.

తే. గీ. లచ్చి నెంతైన వెరుదీయ కిచ్చునపుడు
ముచ్చటల ముంచి తేల్చి యీ పచ్చిలంజ
పరువు నడఁచి నే నిటు దీని పంచఁ జేర
జాలి లేకెంత సహ్యాయుఁ జాటు చుండె.

తొయ్యలీ! న న్నిటు త్రోసివేయుట న్యాయమా!

నాగ—న్యాయము గా కేమి? నీ విట్లొకగంటసేపు నాయొద్ద నుండిన
ముందు నేను కారాగారమునం జేరం గలదాన నౌదును. ఊం.
పొమ్ము వేగమే నెత్తిని ముసుంగు పెట్టుకొని.

మార్తాం—పోవలసినదేనా?

నాగ—నోరెత్తకయే.

మార్తాం—దయ లేదా?

నాగ—ఇప్పుడు లేదు. ముందుం గలుగం బోదు.

మార్తాం—కాంతామణీ! ఈకష్టదశలోం దప్పక నన్ను కాపాడుదు వని
కొండంతయాస నెత్తిపైం బెట్టుకొని వచ్చితిని. ఇట్టితఱి నీయుగ్ర
కోపమును మాని అనుగ్రహముం జూప కున్న నే జీవింపం
గలనా? (మీఁది కేఁగును.)

నాగ—ఛీఛీ! జ్ఞానహీనుఁడా! పొమ్మనం బౌరుషము లేదురా? ఉన్మత్తుం
డవై మీఁదం బడం జొచ్చితివా?

మార్తాం—ఓనాగరత్నమా! నీ విప్పు డీగతి నన్ను దూషింపుచున్న
ను అవియన్నియు నాకు భూషణతుల్యములే. నామది పదింబ
దిగ నిన్నే వరించి యున్నది. చూడు.

తే. గీ. నిన్నుం గాంచినదాది యో నీరజాక్షి!
కుసుమబాణుఁడు నాయందు కోప మూని
పరపు చుండెను శరకోటిం గరుణ మాని
తాళం జాలను బ్రోవవే జాల మేల?

ఇదిగో! నీయాలింగన మానందదాయకముగ నాకిచ్చున ట్టిష్టపడినం
గాని నీపాదములు విడువను (కాళ్ళం బట్టి) కా దనక కరుణించుము.

నాగ—అధముఁడా! ఆలింగనము కావలయునే? (తన్ని) పొమ్మావ
లకు. లేదా! ఇప్పుడే నిన్ను రక్షకభటులకు నొప్పగింతును.

(పోంబోవ.)

మార్తాం—(మహాకోపమున) ఆఁ ఆఁ ఛీ ఛీ! చండాలురాలా! కాళ్లంటి మ్రొక్కినను కరుణ లేక కిడకు నన్ను రక్షకభటుల కొప్పగింప సిద్ధపడితివిగా విశ్వాసహీనురాలా! చూడు ని న్నిప్పుడే యమభటుల కొప్పగింతును (రివాల్వరు ప్రేల్చును.)

నాగ—హా!—(నేల కొఱఁగును)

మార్తాం—

తే. గీ. కాముకోద్రేకము పూని కలుషమతుల
నీతులఁ దొరంగి నందఱ సౌధ ముంచి
సరసకోటిని బ్రాల్చిలము సలుపు చుండు
నెల్లవారికి నగుఁగాక యిదియె శాస్తి.

(అని యామెను తన్ని నిష్క్రమించును)

---

షష్ఠాంకము—ప్రథమరంగము

మార్తాం—(రాజవీథిఁ బ్రవేశించి) ఆహా! ఆసిచురా తొంతనింద్యముగ మాట్లాడినది? పాతకురాలను గాఁ గావించెనగా? అట్లు నాకు శాస్తి కావలసినదే లేనిచో—

ఉ. పూతసతీలలామ వరభర్తృసమాగమమున్ గృపామతిన్
నీతిగణావసక్తమను నీచుఁడయి మాలి విశేషకష్టముల్
పాతకి నాకు పెట్టి చెడి ప్రాయము నమ్మడిహీనురాలికిన్
ఖ్యాతను జేయ ఛీ చనుము శూన్యమతీ! యని తన్నదే ననున్.

నిజముగ మదీయాజ్ఞానాంధకారమును తద్వాగ్వచోరచనచాతురీధురీణ భానుకిరణజ్వాలలచే భస్మీభూత మొనర్చినది. అప్రమత్తత నుండరాదు. ఇందెవ్వరైన గూఢచారులు నన్ను గుర్తింప నుద్యమింపరుకదా కాని

ప్రభుత్వము వారితో విరోధము పెద్దపులితోఁ జెలగాటవంటిదే రాజశాస నంబునకు మేర కలదా! వారి కసాధ్యం బెయ్యది?

సీ. "రూకల నోటుల రూఢి సృష్టించుదే
శద్రోహులను బాధ సలిపినారు
తస్కరకృత్రిమ దారుణవ్యక్తుల
ద్వీపాంతరంబుల దించినారు
రాక్షసక్రియల ని ర్వర్తించుక్రూరులఁ
జెండి తలలు వేరు చేసినారు
సత్యాగ్రహోద్యమ స్వాతంత్ర్యజనులను
గొట్టి చెఱలయందుఁ బెట్టినారు

గీ. కరినదుష్కరక్రూరద ఘాతనీచ
కార్యవర్తనుండే నగు కతమునందు
నెట్టు లైనను వెంబడిఁ బట్టుకుండ
విడువర" నునాస నేటితో విడిచినాఁడ.

అబ్బా! యెన్నఁడును లేనినామనం బేల యీనాఁల వ్యాకులం బందుచుండెను ఇప్పుడిది పాప నామెయిుటఁ గ్రహించినపత్రికను చదువుటయే యవశ్యాచరణీయము. (తనయొద్ద నున్నపత్రిక విప్పి చదువుచు నాశ్చర్యమున) ఆఁ ఏమీ! నాకై నాయఖాంగి కీదినముననే మరణదండనయా! ఎట్టివిప్లవసందేశము! హ్మాదేవీతుల్యురాలవౌ ఓనాదేవీ! నాపై నీకెంత కాయమిత్రప్రేమ. పతితపతి చేతస్కప్రేరేపణాభీలబడబాగ్నికణంబుల నీ వేల పడఁ బాల్పడితివి? ఔరా! ఇదేమిన్యాయము. అనర్గళగంగాదేవీసమానపావనురాలికా యీకఠినశిక్ష! దుర్భేద్యభీషణ దురితాచరణాఖిలజనహృదయభయదవర్తనుఁడౌ మార్తాండమూర్తి మేనఁ బ్రాణములఁ గలకాల మిట్టి దెట్టివారికిఁ గూడఁ జేయ నలవి కాదు, కావింపఁ జాలరు; కలుగ నేరదు.

ఉ. చిచ్చునఁ జొత్తు మొత్తు దసి । సింగమునే నెదిరింతుఁ గోపినై
ద్రచ్చెదఁ గుంభికుంభమును । వ్రయ్యలుచేతును శైలరాజముల్
వచ్చిన శౌరి శూలియును । వారిజనాభుఁడు నిల్చి పోరి నే
నిచ్చియు నైనఁ బ్రాణముల । నింతిని గాచియె తీరువాఁడనే.

(వడిగా నిష్క్రమించును.)

---

షష్ఠాంకము — తురీయరంగము.

[రాస్కెల్సు సాధువేషములతో సాంబ సదాశివ సాంబ సదాశివ సాంబశివ హోం హర అని పాడుచుఁ బ్రవేశింతురు.]

దుర్గా—భవతు భిక్షాందేహి మాతా! యనుచు నీవిధముగఁ బూటకు నాలుగిండ్లు కేగినఁ గాలక్షేపమునకు లోటుండ దని నా యైడియా!

శ్యామ.—కావున్న మన మిందిట్లు గెలాసాట? పనిపాటుల కింతయు బనికే రాము. ఆస్తులా యంతకన్న లేవు. పెండ్లిండ్లసలు కానే లేదుకదా! బంధువులు మనకై చింతించు రన్న బాధ లేనే లేదు. తల్లిదండ్రులైననుఁ దలంచ రెప్పుడు. మరియు రౌడీల మనియు మోసగాండ్ర మనియు సిటీయూక్టుప్రకారము పోలీసు దరి యాప్తుగో నుంచుటచేత నిట్టిమప్రతిష్ఠతో స్వగ్రామమే చేరిన డేంజ రని సకలపాపనాశని యగునీకాశిం జేరితిమి కదా! ఇక్కడ నింక సత్రములో భోజనములు, మఠములో నిద్దుర యన్నట్లు నేదోవిధముగా జీవయాత్ర సాగించుటయే యుత్తమము.

భాస్క—ఏమది జైలు విడుదల కాఁగానే స్వగ్రామమున కేఁగిన యప్పలస్వామి మనలను వెదకుకొనుచు నిటే వచ్చు చుండెనే!

అప్ప—పోనాది బాబూ! నే ననుకున్నట్టు నాయాలి మరోడుతోను.

శ్యామ—అట్లయిన మరిప్పు డేమి చేయుదువు?

**అప్ప**—మియ్యిట్లప్పికొనంగా మిమ్మల్నట్లుకోఁ దలఁచి—

**భాస్క**—ఇంకేమి? మరల నేక్ ఉపయోగించి యొకడూపింగ్ బిజినెస్సు ఓపెన్ చేయుదమా యేమి?

**శ్యామ**—నాన్నన్ను! ఇంక మాయోపాయములమాటమాత్ర మెత్తఁ గూడదు. ఇట్టి వేమైన నికను ముందు చేసి పట్టువడినచో నా జన్మాంతము శిక్షింపఁ బడుదును. (ప్రక్కకుఁ జూచి) ఆహా! ఏమిమనభాగ్యము! చూడుఁడు మహాత్ముని—

[అంత నీలకంఠస్వామి నిత్యానందముతోఁ బాడుచుఁ బ్రవేశించుచు.]

**శ్యామ**—స్వామీ! భవదీయనిష్ఠురములకుఁ బాత్రుల మైన యపరాధుల ననుగ్రహించి పాలింపవే (కాళ్ళఁ బడుదురు)

**నీల**—ఆహా! యోధానయోధుల మని ప్రఖ్యాతిగాంచు యీ తులువ లెంత లో విరాగిస్వరూపు లైరి! తనయులారా! మీకు శుభ మగుఁ గాక! నేఁటి నుండియుఁ బరమేశ్వరసేవఁ జేయుచు నాశీష్యులై యుందురు లెండు.

**శ్యామ**—మహాత్మా! అత్యంతక్రూరులమై మేము మార్జించిన పాపపరంపరలను శీఘ్రముగఁ బాపఁ జేయు మార్గ మేదియైన మాకు బోధింపుఁడు

**నీల**—ఓ వెఱ్ఱితనయులారా! ఇతరమార్గ మేల?

**తే. గీ.** ఆత్మ పరమాత్మయందున నైక్యపరచి
నిర్వికల్పనిమగ్నులై శర్వుఁ గొల్వఁ
బాపపుంజము ల్వడిఁ బటాపంచ లగుచుఁ
దొలఁగిపోవును వేఱొకఁ దలఁచ నేల?

**అందఱు**—ధన్యులము. మహాత్మా! ధన్యులము

(రమణయ్యసెట్టి ప్రవేశించి) లోభివానిసొమ్ము లోకులు
పాలనోన్నెళ్లెగ్రోళ్లా.

సీ. పిల్లికిబిచ్చంబు । పెట్టకుండగనాస్తి
ప్రేమతో బోలెఁడు । పెంచినాను
నిలువెల్ల మాయతో । నిశలంకుచెల్లని
మాయనాణెలెన్నో । మార్చినాను
ముసలితనమునందు । బుద్ధి గడ్డినితిని
మూఁడువేలోసి పె । ళ్లాడినాను
చీమనైనను నింట । చేరకుండగచేసి
కొరమిదయ్యములాఁగ । తిరిగినాను
కరినముగ కాలమిట్లు నే । గడుపుచుండ
కళ్లలోదుమ్మోసి ధనము । పెళ్లముకడ
దోచుకొని రంకుమగనితో । లేచిపోఁగ
మోసగాట్లు కొంపనుమ్మెట । ముంచ దిక్కు
తెలియకే యిట్లు పూఁమార । తిరుగుచుంటి.

అబ్బోరయ్యా! యేంటీసమావేశం! సాధువుగారికి సాష్టాంగాలండి. స్వామీ! దారులు కొట్టటాకంటే దారుణంగా తనువుఁ గశుపుకొను యీమర్మగులికి ధన్యత్వమెక్కడ దాపరించింది బాబు! (నిత్యానందమును జూచి) ఓరి! కొంపలు కూల్చివాఁడా! నువ్వుకూడా యిందులోనే వున్నావూ? యెసక్కు తగ్గుతాఁవే. అన్నట్లు అడగ మఱిసేను అదేఁ వయ్యింది? ఆమె నింకెవరికైనా అప్పఁజెప్పేవా యేంటి నువ్వు భరించలేక! స్వామీ! అన్నం పెట్టేవారింటికే కన్నం తవ్వే రకాలివ్వి: కాఁబట్టి వీళ్ల నీపాటి కిడిసిపెట్టి గంగకి పఁగెట్టి స్నానంజేసి గట్టెక్కండి. నీల—ఐన నాఁగాళ! ఇట్టివారజ్ఞానముఁ బాసి యార్యులు కాఁగూడదే?



# [illegible]

అను,

# పతిసేవానాటకము.

## సప్తమాంకము.—ప్రథమరంగము.

[స్థలము, వధ్యశిల అం హేమవతియు ఇన్స్పెక్టరు, పోలీసులు ప్రవేశించుచున్న ]

ఇన్స్పె—ఓ హేమవతీ! ఇప్పటికి నీ స్వార్యము విడిచి దేశద్రోహము సమ్మం బాల్పడక నీభర్త నుండు స్థానము తెలిపి ప్రస్తుతము ప్రాణమును కాపుకొనుము. ఇది కడపటిగంట. ఇంక యోచించినం బ్రయోజనము లేదు.

హైమ—హా! పరమేశ్వరా! నాకిపు డేది కర్తవ్యము? నాదరిద్ర ప్రాణములకై యోచించిన నా కిచితేసు జీవముల నా మనసారం దీయించినదాన నగుదును. నేనిట్లు చచ్చి నాపతిని మాత్రము రక్షింప నేమిప్రయోజనము? దిక్కులేక యొకప్రాణి ననవసరముగం జంపించుటకా!—ఆం ఓహో! హైమా! సతీపతులసంబంధమె నీవు గట్టిగ మనసునం బెట్టుకొనవలయునే కాని యన్యాలోచన లేల?

మ. హేమరాడ్జాపతియగ్ని నేత్రమున నిర్ద హింసించి వే కాల్పనీ
సమయం జేయఁగ శ్రీధవుఁడును స్వస చ్ఛక్రాగతిం జీల్ప నీ
యముఁడే కుత్తుక వైచి పాశమును న త్యంతంబుగా లాగనీ
కమనీయప్రదసాంతరంగమును నిం కం ద్రిప్ప కింతేనియుఁ౯.

ఆహా! యేమైనఁ గానిమ్ము నన్నెంతైన హింసింప నిమ్ము. కఱకుకత్తులతో నాకుత్తుకను దుత్తునియలుగాఁ గోయ నిమ్ము. చెప్పను నా నాథునిరహస్యమును సుంతైనఁ జెప్పను.—ఓ న్యాయరక్షకులారా! ఇదిగో! సంసిద్ధురాలనై యున్నాను. కొట్టుఁడు తిట్టుఁడు కోయుఁడు తుదకు దావానలమునఁ బెట్టి దహింప—

ఇన్స్పె—ఏమీ చెప్పవా?

హైమ—ముమ్మాటికి.

ఇన్స్పె—'జ్ఞానహీనురాలా! నీపతి పరమదుర్మార్గుఁడే! పరప్రాణాపహరణధురీణుఁడే! ఎందఱిప్రాణములు నీధవుఁడు పొట్టఁ బెట్టుకొనెనో! ఎన్ని సంసారములు నీవిభునిమూలమున నడుగంటెనో! కన్నతల్లిదండ్రులనైతము హింసించి తుదకు నీప్రాణములనుగూడఁ దీయ యత్నించినకఠినకర్మునియెడ నీవు పతివ్రతమును సాగింపుచుంటివి కాఁబోలు! ఏమి హిందూమతధర్మము! భర్త యెంతకంటకుఁడై యెట్టిచెడుపనులు చేయుచున్నను భార్యమాత్రము నిష్ఠతోఁ బతి కెదురు రాడక ప్రవర్తించ వలె నఁట! ఇట్టియపరాధునియపరాధమును గప్పిపుచ్చి ప్రజ్వరిల్లఁ జేసినపాపాగ్ని నెన్నిజన్మంబు లెత్తి చల్లార్చుకొనెదవో తలంప కుంటివి?

హైమ—ఓ పాశ్చాత్యమతసిద్ధాంతకా! సంతతరాజకార్యనిర్వాహధురేయా!

తే. గీ. సర్వభువనైకసుకృతసం స్థాపనమున
శ్రేష్ఠమై స్త్రీలపాలిటఁ జెలఁగె నద్ది

యట్టిదౌ ధర్మపతిపాద సాధ్యసేవఁ
జేయ జీవముల సఱకు సేయ నేను.

ఇన్స్పె——(తనలో) అబ్బా! ఏమి యీమెపతిభక్తి! ఎంతనిశ్చలము!
(పైకి) అమ్మా! దేవు నారాధించుకొనుము. నీకర్మమునకు మే
మేమి చేయఁగలము?

హైమ——అయ్యో! నానిజదేవునకై ప్రాణములనె ధారపోయుచుండ
నన్యదేవారాధన యేల? ఐనను (చేతులు జోడించి)

ఉ. ఓమహనీయతేజ! యిటు లుజ్జ్వలభక్తి భజింపుదాసియం
దేమఱియుంటి వీవకట! యే నిఁక వేఁడఁగ లేను కాల మిం
కేమని నే నుతింపఁగల నీశ్వర! యెప్పటికైన నాథునిన్
నేమముతోడ నాపతిగ నిల్పుము నాస్త్యముఁ బాపి భాస్కరా?

ఇన్స్పె——భటుఁడా! ఇంక నీపని నీవు నెరవేర్పుము.

భటు——(కత్తి ఝుళిపించుచుండును)

మార్తాం——(ప్రవేశించుచు)

మ. అరరే! యెట్టివిచిత్రముద్రమున నాకై కూలె నాకాంత హా!
కరుణాసింధులు లేరె యీజగతి నా కళ్యాణి రక్షింప? మున్
సిరితోఁ జెప్పకయేగి దంతితనువున్ శ్రీశౌరి కాపాడఁడా!
హర! రారా! యిఁక నెవ్వ రింక గతి నా యాత్మేశ్వరిన్ బ్రోవఁగన్.

అయ్యయ్యో! ఈఖలునిప్రాణములను నిలువఁ బెట్టుటకా యో సాధ్వీ
లలామా! నిజజీవితమును ధారపోయుచుంటివి? ఓమార్తాండా! ఇట్టి
మహాతరుణమున నీధైర్య మేమూలఁ బారవైచితివి? అక్కటా! తృణ
ప్రాయముగఁ దనప్రాణమును నాకై వినియోగింపుచుండ నే నిట్లు
పిచ్చివానివలెఁ జిందులుతొక్కుట యుచితము కాదు. పిమ్మట నేమైనఁ

గానిమ్ము. ముందు నా యిల్లాలిని రక్షించుటయే నాకర్తవ్యము.
(హైమవతిని చంపనున్నభటుని వేల్చును )

భటు—హా... (నేల కొరగును )

ఇన్ను—(అదరిపడి) అబ్బా! ఎవ్వఁడీసాహసుఁడు ? (చూచి) ఇంకెవ్వఁడీకథానాయకుఁడే! ఇంకెందుకుబోఁ గలవురా! (వెన్నాడి మార్తాండుని వ్రేల్చును )

మార్తాం—హా...అబ్బా! (క్రిందఁబడి లేచి) ఇదిగో! నీదెబ్బ తిన్న బెబ్బులికడసారి వ్రేటు. (తన్ను పట్ట వచ్చునుద్యోగిని వ్రేల్చును.)

ఇన్ను—హా!... (నేల కొరగును.)

మార్తాం—(తగిలినదెబ్బను దడుముకొనుచు విచారమున) హా! దుర్భరము!—నే నీయసురుల నిఁక నొక్క గడియ యైన భరింపఁజాల! ఓసాధ్వీ! హైమవతీ! నీ వేమిపాపము చేసికొని యీదుర్మార్గునిపత్ని వైతివి! అక్కటా! యింత మూఢిననుమానసంసారవృక్షము వ్రేళ్ళతోఁ బెకలించుకొని నేల కొఱఁగినను సుజ్ఞానమబ్బక యింతవఱకు నొతలజ్ఞానమును సంచరించితిని! నే నెందఱకో కానివాఁడ నైతిని. ఎన్నిహత్యలకుఁ దలయూపితిని! ఎంతెంతలో దారుణములకు నొడిఁగట్టితిని ఎన్నిసంసారములు నట్టేటగల్పితిని. పతితపాపుండ నగునాపాపము పండినది. నే ఘాతుకవిషపూర్ణకర్కశహృదయ ఘోరరాక్షసతుల్యుఁడను. ఉత్కృష్టనీచసామ్రాజ్యపట్టభద్రుఁడను ఔరా! నాయీపాపఫల మెన్నిమన్వంతరములు తప మొనర్చి పాపుకొనఁ గలను—హా! హా! అదిగో! బ్రాహ్మణహత్యాపాపఫలము తీక్ష్ణోజ్వలప్రచండాగ్నిజ్వాలయై నన్గాల్చ వచ్చుచున్నది. (వెనుకకుం దగ్గి మరియొక వైపుఁ జూచి) అక్కటక్కటా! యీచక్కిఁ గూడ గురుబంధుమిత్రస్త్రీవధాకారణాఘములు ఘోరాహిరూపములు దాల్చి

భుగభుగారావములతో లాంగూలదీర్ఘోన్నత్యములతో నాపైకి లేచుచున్నవి (మరియొకవైపు చని) అమ్మయ్యో! ఏమి యీ బీభత్సాకృతులు!—దేశరక్షణోద్యోగరాజభటనిర్మూలనకారణ ప్రేరేపణయమభటులు నానావిధాయుధహస్తులై యాగ్రహోదగ్రులై ఘోరాకారాదిశోభమున నన్నుబడద్రొబ్బుటకు నెల్లఱు నొక్కసారిగా నామీఁదకు నురుకుచున్నారు. ఎం దేఁగుదను? ఎం దేఁగినను లోకకంటకుండ నగు నన్నుఁ గాపాడువారెవరు? కర్మ పాపక్లిష్టుని నన్ను కట్టి కుడుపక విడుమనే?—ఓసర్వేశ్వరా! అమితవిషపూరితకుటిలక్రూరఘోరపాపఘాతుకనిలయమగు నన్ను బడబానలమునందుఁ బారవేయుము. నీ త్రిశూలమున నా శిరంబును గుచ్చి కాకగృధ్రమాంసాశనపక్షిసమూహములు గలమిన్నున కెగరవేయుము. నిర్దయహృదయయమభటులచే నాసర్వాంగములను రంపముచేఁ బరబర గోయించ నాక్షేపము, కాని యెంతమాత్రము నాపూజ్యురాలిని నా పతివ్రతను నాపుణ్యమూర్తిని హింసింపక రక్షింపుము దేవా! రక్షింపుము కట్టా! యేల నాగోల నాలకింపవు?—ఓపంచభూతములారా! మీరైనఁ బూనుకొనుఁడు—అయ్యయ్యో! కాలవిళంబన మగుచున్నదే! ఎవ్వరును నాయాక్రందనములను జెవులొగ్గి వినరా! హా! సాధ్వీ! నీ వెంతకస్థితి నుంటివో కదా! ఓమాతాపితలారా! అధముఁడను నోజనకా! మున్ను నిన్ను రక్తము ధారలై నేలఁ గారునట్లు కొట్టి మీకనినకడుపులకుఁ జిచ్చుపెట్టి సర్వము నేనే బాపుకొని నొంచి మిమ్మిల్లు వెడలించి తుదకిట్లు దిక్కుమాలి స్రుక్కి స్రుక్కి నక్కలకిరవుగానున్న పాషాణహృదయునిపశ్చాత్తాపప్రణామముల గైకొనుఁడు. ఓహైమా! ఇదిగో! వచ్చుచుంటిని. నీపవిత్రగాత్రసమ్ముఖంబునఁ బడి మరు

జన్మంబుల నైన ఋణవిముక్తి నందక మహేశ్వరసేవాసక్తచిత్తుఁడనై తమున్ననంద నిదే వచ్చుచుంటి... (పోఁబోయి నేలఁ బడి) ఆహా! ప్రపంచమంతయు నే మిట్లు తిరుగుచున్నది! (లేచి) హా! ఈవేగమునకు నే నాఁగఁజాల! (మూర్ఛిల్లును.)

[అంత జటావల్కలధారులై సుగుణశీలసుగుణవతులు ప్రవేశింతురు.]

సుగు—(పడియున్నమార్తాండుని జూచి) అయ్యయ్యో! పాప మెవ్వ రీతనయుఁ డిట రక్తపూరితము లగువస్త్రములతో ధరణి కొఱఁగి యుండెను?

సు॥వతి—అబ్బా! శిరమున నెంతపెద్దగాయ మున్నది? అక్కటా! ఎవ్వ రీతని నింతగా బాధించిరో కదా! ఇంకను గొనయూపిరి యున్నట్లు తోఁచుచున్నది (ఉపచారము చేయుచుందురు.)

మార్తాం—(కొంచెము కదలుచు) హా!.... హైమా! (నిట్టూర్పు పుచ్చును)

సు॥వతి—హైమయా! ఏహైమ? మాకోడలు కాదు కదా! మరు లామెను దలఁతురా! అట్లయిన నీతఁడు మాపుత్రుఁడా? అబ్బా! ఏమి నాబుద్ధి! అమంగళము ప్రతిహత మగుఁ గాక!

సుగు—హైమ కాదు. లెమ్ము స్వస్థచిత్తుఁడవు కమ్ము గాయముబాధనే కాక యీయొడ నిటులు మఱఁగుచున్ననిన్ను మాయాశ్రమమునకుఁ దీసికొని పోవుదుము రమ్ము.

మార్తాం—(కనులు తెరచి) అవ్యాజకరుణాయత్తచిత్తు లగునోమహాత్ములారా! అంటకుఁడు. నన్నంటకుఁడు. ఈఘోరహంతకు నంటి మీయకళంకకరకమలములను గళంకపూరితములు గావించుకొనకుఁడు.

సుగు—నీ వెవ్వరివాఁడవో నీవృత్తాంత మెట్టిదియో మాకు గోచర మగుట లేదు కాని నీ వెంతదుష్టుఁడ వైనను బశ్చాత్తాపచిత్తుఁడ వగుటచేతఁ జాలపాప మంతరించినది లెమ్ము.

మార్తాం—నావృత్తాంతమా!...నావృత్తాంతము వినిన మీభవ్యశ్రో
త్రములు చిల్లులుపడును...మరియు నే నెవ్వరివాఁడ ననియా?
సుగుణశీలగర్భపయఃపారావారమునం దుద్భవించినప్రళయకాల
బడబానలమును—

సుగుణశీల, సుగుణవతి—హా!...తనయా! (మూర్ఛిల్లుదురు.)

మార్తాం—ఏమి! మీరు నాజననీజనకులా! హా!...దైవమా!...హా!
దై—ఐవ—మా! (చచ్చును.)

హైమ—(భర్తను వెదకుకొనుచుఁ బ్రవేశించి)

సీ. తరులార! గిరులార! దాచితిరా యేమి
మద్విభు మీయెడ మరుఁగు నందుఁ
బలుక రేమమ్మ! యో పక్షివర్గములార!
యెందుండె నావిభుఁ డెట్టు లుండె
గంగాభవాని! నీ కలకలం బాఁపి నా
పతివార్తఁ దెలుపుము ప్రణుతి చేతు
సూర్యచంద్రయుగాఖ్య సుజ్ఞానధనులార!
చూపరే నాథు నా చూడ్కు లలర

తే. గీ. రణదమారణభయ ఘోర రాట్కృతఘ్ను
ఘాక కాఁగక యెం దేఁగి డాగినాఁడొ
బ్రతికి యున్నాఁడొ జీవముల్ వాసినాఁడొ
వేగఁ దెల్పు మనాథ శ్రీ విశ్వనాథ!

అందెవ్వ రట్లు పడి యుండిరి. (సమీపించి) హా! యిం కేమున్నది? (భర్తపైఁ బడి విలపించుచు) నాథా! నమ్మి యున్నపత్ని నిట్లు వీడి చన మీకు ధర్మమా! కాంచఁ జాల మీయీదుస్థితి నాయీకనులఁ గాంచఁ జాల (అత్తమామలఁ జూచి) ఈపడియున్నతాపసు లెవ్వరు? ఇట్లుండఁ గత మేమి? (గ్రహించి) హా! యేమి విధికృతము! మూఁడు

నెలల నుండి యీపురమెల్లెడల నెమకుచున్నను గనుపింపని నాయత్త మామ లిత్తఱిఁ దమపుత్రుఁ డస్తమించుసమయమున వచ్చి మూర్ఛ మునిఁగి యుండిరి. హా రామా! అంతటికుటుంబ మెంతలో వింతగ రూపు మాసిపోయెను! ఇం కెంతవిచారించి యేమిప్రయోజనము! పతి లేనిసతికి బ్రతు కేల? ఓసర్వేశ్వరా! దీనికంతకు రసమూలకారణంబగుఘాతుక జీవహత్యాదోషపూరితనీచనరకహేయవైతరణీఘోరసమమద్యరసదవృక్ష మును తల్లివ్రేళ్లతోఁ గూడఁ బైకి పెకలించి కాల్చి మసి చేసి సాగర మునఁ గలిపి మద్యసేవకుల మంచివారిగఁ జేసి పాలించవే! పరధనాప హరణ పరస్త్రీసంభోగపరాయణు లగుమూఢప్రజల కాహీనకార్యము లుచితములు కావని మొగముపైఁ జెప్పు వేసినట్లు చెప్పి మాన్పింపవే! అంతమాత్రమే కాక యింకను హెచ్చు పెరిగి యున్న దురాచారములన్నిటి నొక్కసారిగ నీబ్రహ్మాండభయదత్రినేత్రజ్వాలల కాహుతిఁ జేయవే! అయ్యయ్యో! నేఁటితో మాకును నీప్రపంచమునకును సంబంధము సరిపోయినది కాఁబోలును! ఇట్లు దినమున కెన్నికుటుంబములు కూలు చున్నవో నీదయావీక్షణములతో నొక్కసారి వీక్షింపుమా దీనబంధు! ఆఁ ఇంక నే నాలసించినచో నావిభునిఁ గలిసికొనుట కష్టమే. నాథా! వచ్చుచుంటి. ఆలస్య మేమియు లేదు. మీకట్టు నానుకొని యిట్లు మూర్ఛ మునిఁగి యున్ననాయత్తమామల కీయంత్యకాలమున నొక్క సాష్టాంగప్రణామము చేయుట కాక యీప్రపంచమున నా కింక వేరు పని లేదు (ప్రదక్షిణము చేసి) ఓపూజ్యులారా!

తే. గీ. కన్నతల్లిదండ్రులకన్న ఘనతగాను
కింటికిని అప్పపోల్కి నన్నాచినట్టి
మహితయశులార నాయత్తమామలార!
అంత్యసాష్టాంగము లివిగో యందుకొనుఁడు.

(నమస్కరించి అటఁ బడి యున్న రివాల్వరుఁ దీసి) ఓమాయుధమా! నీవు నానాథుకరమున నే ముహూర్తమున నధివసించితివో నాఁటి

నుండియు న్యాయాన్యాయముల నెంచక పాపపుణ్యములఁ బాటింపక యక్రమముగ నెందఱినో హతమార్చిననీతీక్ష్ణత్వ మీదీనురాలిపైఁ గూడఁ జూపి ధన్యురాలిగాఁ జేయుము (ప్రేల్చుకొనిచచ్చును)

(సుగుణశీలసుగుణవతులు అదరిపడి లేతురు.)

సుగు—కాంతా! యింకేమున్నది? గోరుచుట్టుపై రోఁకటిపోటుబలె మనకోడలుకూడఁ బతివెంటఁ జన మృతిఁ జెందినది.

సుగుణవతి—హా! దైవమా! యీదుర్భరదుఃఖ మేను భరింపఁ జాల.

(కోడలిపైఁ బడి మరల మూర్ఛిల్లుచు.)

సుగు—ఓవిశ్వేశ్వరా! నా కొడుకునకుఁ గోడలికిఁ గూడ నప్పుడే నూఱేండ్లు నిండించితివా? హా! తనయా!

సీ. ఘోరలీలలు చేసి \ కూర్చినపాపంబు
యజ్ఞయాగాముల \ నడఁప కుండ
అత్యంతయోగ్యమై \ యలరినమనకీర్తిఁ
జెఱచిననీవెల్లొ \ వేర కుండఁ
గష్టములన్నియుఁ \ గడచినపిమ్మట
నొక్కచో సుఖముచు \ నొందకుండ
నీక్షేమమునకునై \ నిముసమేమఱ కేము
సలిపెడువ్రతములు \ సాగ కుండఁ

తే. గీ. గులము నిల్పఁగ నొకచిన్న \ కొడుకు నైనఁ
గనక కులకాంతతోడ మా \ కనులయెదుటఁ
గాటి కేఁగుచు నుంటివా \ కానివిధిని
గనినకడుపులు ప్రక్కలు \ కావ? కొడుక!

అయ్యో! యీమె దుఃఖసముద్రము నీఁదలేక మూర్ఛ మునిఁగి యున్నది. దేవి! లెమ్ము లెమ్ము. ధైర్యము తెచ్చుకొమ్ము. మనల నిల్లు వీడి వీరిదారులు వీరు చూచుకొనిరి. మనముమాత్ర మిఁక నేరిన్ని

చూచుకొని మన వలయును. వేగమే లెమ్ము ఆగంగానదియందు నుఱుకుదము రమ్ము రమ్ము.

సుగుణవతి—ఔ నదియే సమంజసము. అమ్మా! హైమవతీ! సుగుణమతీ! ఎంతసాహసకృత్య మాచరించితివే? హా పరమేశ్వరా!

సీ. తలలోనినాలుకై తనరుబంధువులలోఁ
బతికి మాఱుగ నెప్డుఁ బలుకఁ బోదు
పెద్దలందఱియందుఁ బ్రేమపట్టున నుండు
గష్టము పెట్టదే దుష్టు నైన
వేడుకలను జూడ వేఁడదు విభు నైన
వీధివంకకుఁ జూడ వేడ్కపడదు
మామగారియెదుట మాటాడ నేరువ
దత్తయానతి నెంతొ యణఁగి యుండు

తే. గీ. విభున కండయై నిలిచిన విబుధురాలు
వరపతివ్రత యై యున్న ప్రాజ్ఞురాలు
ప్రాణములుఁ బతికిచ్చిన భవ్యురాలు
నబ్బునే యెన్నిజన్మము లైన మాకు

సుగు—(ఉన్మాదమున) అయ్యయ్యో! యీసరికే చాలనాలస్యమై పోయెను. చూడు సుదతీ! మనపుత్రుఁ డప్పుడే వైతరిణిని దాటుచుండెను. కోడ లేదీ?—ఆఁ అదిగో! దేవదూతలు కొనివచ్చినపుష్పకముకు నావిభునితోఁ గాని నే నొక్కతె నెక్క నని వారితోఁ దగవు లాడుచున్నది. తల్లీ! తగుదు వీ వెంత కైన: అమ్మా! ఇదిగో! మేమును వచ్చు చుంటిమి. (పోవుచుండ)

నీల—(శిష్యులతో నెదు రేఁగి) ఆఁగుఁ డాఁగుఁడు. అమ్మా! యేమి యీ వెఱ్ఱి? కాలవశమునఁ గల్గినకష్టము నుపశమింపుకో నేరక వారితోఁబాటు మీరుఁగూడఁ జావ నుంకింపు చుంటిరా? యీజగతి నెవ్వరు శాశ్వతముగ నుందురు?

సీ. కాలమ్మ మూడఁగా | ఘను లగునాల్గురు
చక్రవర్తులుఁ గూడఁ | జచ్చినారు
కాలమ్మ మూడఁగాఁ | గవచ మింద్రునకుఁ గో
యించి యిచ్చినకర్ణుఁ | డీల్గినాఁడు
కాలమ్మ మూడఁగాఁ | జాలఁ బ్రజలబాధ
కెడపినట్టిశివాజి | మడిసినాఁడు
కాలమ్మ మూడఁగా | బాలగంగాధర
తిలకమాన్యుండును | దీరినాఁడు
తే. గీ. అట్టి భరతమాతసుపుత్రు | లిట్లు పోవ
నిట్టి దుష్టునికొఱ కేల | యింతచింత
సాధ్వి హైమవతి సుకీర్తి | శాశ్వతముగ
నీప్రపంచము కలకాల | మిట్లు యుండు.

ఈప్రపంచమంతయుఁ జిత్రనాటక మని యెఱుఁగరే! ఈబాంధుప్రమేయ మంతయు ఋణానుసంబంధ మని తలంపరే! ఎవ్వరికెవ్వరు కర్తలు! అంతయే కాక సుఖదుఃఖము లేకి శాశ్వతములు! ఇట్టిసమయములందు ధైర్య మవలంబించినవారే ధన్యులు. లెండు లెండు. విచారమును పారద్రోలుఁడు. వేగమే యామృతకళేబరములకు దహనసంస్కారాదికృత్యము లాచరింపుదము రండు రండు.

సుగు—పిమ్మట నేరిని చూఁచుకొని బ్రతుకు చుందురు మహాత్మా!

సువతి—ప్రేమికులవలె మే ముండిన నేమి యూడిన నేమి స్వామి!

నీల—అట్లయిన నీప్రపంచమున నెందరుమహానీయు లంతరింప లేదు!
వారివెనువెంట వారికిఁ గలవారందఱు నరిగిరే?

సుగు—దేవా! మే మింక బ్రతికినమాత్ర మేమిసార్థకము?

నీల—మనమందఱము మనునంతకాలము దుర్వ్యసనచరితదుర్మార్గ
నిర్మూలమునకై పాటుపడుచుందము.

సుగు—అట్లయినఁ దత్సముద్యమ మీక్షణము సనే నెలకొల్ప గను నుఖు

సు, పతి—ఐన నింక నేమి కావలయును ?

నీల—ఇట్లగుఁ గాక ! ఖ

సీ. శ్రీని గీర్తిని బుద్ధి | శీఘ్రగతిఁ జెఱచు
మద్యవిషము తొల్త | మాయుఁ గాక
తల్లిదండ్రుల నైనఁ | దండింప సమకట్టు
దుర్మార్గమును వేగ | దొలఁగుఁ గాక
ధర్మపత్నుల వీడి | దారుణముగ నీచ
తొత్తులఁ గూడుట | తొలఁగుఁ గాక
స్నేహితులనుగూడఁ | జెఱుప యత్నించెడి
కృత్రిమములు నేలఁ | గిట్టుఁ గాక

తే. గీ. జగతి హైమవతీసతుల్ | జన్మ లంది
జూదములు దొంగతనములు | శూన్యము లయి
నిత్యసత్యవ్రతము కీర్తి | నెరపు చుండ
శ్రీనిలయమై ధరణి వేడ్కఁ | జెలఁగుఁ గాక !

అందఱు—తథాస్తు ! (తెర పడును)

గద్య

ఇది శ్రీమత్పతంజలిమహర్షి గోత్రోద్భవ దేవాంగకుల
చింతావంశపయఃపారావారరాకాసుధాకర శ్రీ
సాంబార్యా మహాలక్ష్మీనామాంబగర్భ
శుక్తిముక్తాఫల సూర్యప్రకాశరాయ
విరచితంబైన ఘోర్ రాస్కెల్సు
(అను) పతిసేవనాటకము
సర్వము సమాప్తము.

